# ' చదువులోనూ ఆటలోనూ ఆమె నేర్పు గలది! '



కాని, కొన్నాళ్లకు ముందు ఆమెకు ఎంతో నీరసంగా వుండేది. నేను ఆమెను డాక్టరికి చూపించాను.

డాక్టరు ఇలా అన్నారు: "అదనపు శక్తి కోసం మీ అమ్మాయికి రోజూ హార్లిక్స్ ఇవ్వండి."

హార్లిక్స్ త్రాగటంవల్ల ఇప్పుడు ఆమె ఉత్సాహంతో ఉబ్బి పోతున్నది!



హార్లిక్స్ ఆమెకు శక్తి ఉత్సాహమునూ యిచ్చింది!

పెరిగే పిల్లలకు చురుకుగా వుండుటకు కావలసిన అదనపు శక్తిని యిచ్చుటలో హార్లిక్స్ సహాయపడుతుంది. డాక్టర్లు పిల్లలకు హార్లిక్స్‌ను సిఫార్సు చేస్తారు. ఎందుకంటే అది వారికి దృఢత్వాన్నీ బలాన్నీ యిస్తుంది. మీ అమ్మాయికి కూడ హార్లిక్స్ అవసరము!

హార్లిక్స్ మీగడ గల పాలతో గోధుమ పిండి మరియు మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన సారములు చేర్చి తయారు చేయబడినది




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

HL 7573 A.

శేఖరం వ్యవసాయంలో అందె వేసిన రైతు. ప్రతి పైరుకు కావలసిన గ్రోమోర్ ఎరువు, సకాలంలో వేసి లాభం పొందే శేఖరం గ్రోమోర్ తనకు నచ్చిందంటాడు.

ఎందుకో తెలుసా?

ఏటేటా పైర్లు పండించడం వలన భూమిలో తరిగే పోషక పదార్థాలు తిరిగి భర్తీ చేయక పోతే దిగుబడి తగ్గుతుంది. గ్రోమోర్ ఎరువులు, అమోనియా రూపంలో అందే నత్రజని, అంతా నీటిలో కరిగే భాస్వరామ్లం, సమానంగా ఎక్కువగా కలిగి వుండటంచేత పైర్లకు పూర్తి పోషణనిస్తాయి. గ్రోమోర్ ఎరువులు వరి, చెఱకు, జొన్న, మిరప — అన్ని పైర్లకు తప్పక వాడి ఎక్కువ పండించండి.




గ్రోమోర్ ఎరువులు గుల్ల గుల్లగా వుండటంవల్ల, చల్లడానికి, మొక్క మొక్కకు వేయడానికి, గొఱ్ఱుతో వేయడానికి వీలుగా వుంటాయి. గ్రోమోర్ 22-22-11 లోని పొటాషు కూడా నీటిలో పూర్తిగా కరుగుతుంది.

గ్రోమోర్ ఎరువులకయ్యే ప్రతి రూపాయి ఖర్చుకూ కనీసం మూడు రెట్లు లాభం వస్తుంది. ఇకనుంచీ ఎరువు అని అడక్కండి, గ్రోమోర్ అనే అడగండి.

గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేట్ 28-28-0
గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేట్ 20-20-0
గ్రోమోర్ యన్.పి.కె. 22-22-11
గ్రోమోర్ యూరియా 46-0-0




**కోరమాండల్ ఫెర్టిలైజర్స్**

## అదును తప్పినా, పదును తప్పినా ఫలితం దక్కదురా, అదునులోన

# గ్రోమోర్

## వాడితే పంట దక్కునురా!



## చేనుకు చేవ, రైతుకు రొఖ్ఖం చేకూర్చుటలో పెట్టింది పేరు — గ్రోమోర్

గ్రోమోర్ ఎరువుల వ్యాపార వివరములకు సంప్రదించండి:

ప్రధాన పంపిణీదారులు ఇ.ఐ.డి. ప్యారీ లిమిటెడ్, 66 రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్

4IYARS-CF-34 A Tel

# ఉత్తరాలు

## కథలు

పి. లీలావతిగారి "ఆకలి" కథ చాలా బాగుంది. ఆకలికి అలమటించే పేదలపై ధనికులు దయ చూపించేలా రచయిత్రిగారు ఈ కథని చిత్రీకరించారు.

—స్వర్ణ సుబ్బరాయుడు, [కడప

* * *

"విషవలయం" ఈనాడు సంఘంలో జరుగు దురాగతాలను నిర్భయంగా బట్టబయలు చేసింది. పెద్ద మనుషుల "బురఖాలు" ధరించి ఘరానా వ్యక్తులుగా చలామణి అయ్యే కొంత మంది గోముఖ వ్యాఘ్రాలను మా ముందుంచింది.

కొంతకాలమయినా మా మనసులలో నిలిచే చక్కని నాటిక.

బి. శివరాంకుమార్ [అప్పంపల్లి]

* * *

"విషవలయం" నాటిక మా యువజన సంఘాన్నెంతో ఆకర్షించింది. ఇలాంటి నాటకములకు మన పత్రికలో చోటివ్వండి. ముమ్ముందు యిలాంటి నాటకములు ప్రచురించండి. సీరియల్ నాటిక కూడా ప్రచురిస్తే ఎంతో బాగుంటుంది. యేమంటారు? 'విషవలయం' నాటిక రచించిన శ్రీ లేళ్లపల్లి గారికి మా సంఘము తరపున అభినందనలందచేస్తున్నాం....

గ్రామ యువజనసంఘము [ఈ తాండ్రపాడు]

* * *

"ఆకలి" కథ నన్నెంతగానో ఆకర్షించినది.

కొంగండ్ల యాదగిరి [కొత్తగూడెం]

## సీరియల్

అపరాజిత చదవడానికే భయంగా ఉంది. మాధవికి ఎక్కడ అన్యాయం జరుగుతుందా అని. రాధ పాత్ర కత్తివలే ఉంది. రాధ జీవితం ఏమవుతుందో, మధూ ఏమవుతాడో అని యింకా తెలుసుకోవాలని ఆతృతగా ఉంది. నాయని కృష్ణకుమారిని మాధవికి అన్యాయం చేయకూడదని కోరుతున్నాను. చదువు కథ బాగుంది.

కె. వి. రఘునాద్ [రాజమండ్రి]

## వ్యాసాలు

మన రాష్ట్రంతో మద్రాసు రాష్ట్రాన్ని లేదా ఆ రాష్ట్రాన్ని మన రాష్ట్రంతో పోల్చుకోవటం చాలా పొరపాటు. ఎందుకంటే తమిళనాడు ప్రభుత్వం నాడు నేడు చేసిన, చేస్తున్న మంచి కార్యాలు మన ప్రభుత్వం చేయలేదు, చేయదు. అలాంటప్పుడు మద్రాసు రాష్ట్రంలో నాల్గు విమానాశ్రయాలు ఉన్నాయని మన రాష్ట్రంలో మూడు మాత్రమే ఉన్నాయని అవికూడా రాజధాని నగరంలో ఒకటి మిగిలిన రెండూ సర్కారు ప్రాంతములో ఉన్నాయని రాయలసీమ ప్రాంతములో ఒక్కటికూడా లేదని మద్రాసు నుండి శ్రీ ఎస్. రాజారావు వ్రాసిన లేఖ చూచిన తర్వాత నాకు కొంత వ్రాయాలనిపించింది వ్రాస్తున్నా.

కడపలో విమానాశ్రయం వుంది కాని అది రాయలసీమ కరువుకు లోనైనపుడు లేదా జనరల్ ఎలక్షన్సులో కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులు [ప్రధాన మంత్రి] రాయలసీమ రావలసి వస్తే విమానంలో వస్తారు కాబట్టి విధిలేక క్రిష్ణాపురం విమానాశ్రయాన్ని వాడుకొంటారు. ఈ విషయము అందరికి తెలియకపోయినా కడప వాసులకు బాగా తెలుసు. ఎందుకు దాన్ని అభివృద్ధి చేసుకొని రాకపోకలకు వాడుకో గూడదు పారమెంటులో అప్పుడప్పుడు శ్రీ వై. ఈశ్వరరెడ్డిగారు పై విషయాన్ని అడుగుతుంటారు. దానికి సంబంధించిన మంత్రి ఏదో సమాధాన మిస్తూ వుంటారులెండి. రాష్ట్ర ప్రభుత్వం కేంద్రముపై ఒత్తిడి తెచ్చి కార్యసిద్ధి కావించుకోవాలే కాని మద్రాసు రాష్ట్రంలో నాల్గు విమానాశ్రయాలున్నాయని మన రాష్ట్రంలో లేవని అనుకోవటంలో లాభము లేదు కేంద్రాన్ని అడిగి సాధించగల ధైర్యము వారికుంది. అది మన నాయకులకు పూజ్యం ఎందుకంటే మనది కాంగ్రెసు ప్రభుత్వం.

పుష్పరాజ, [చిత్తూరు]

## న్యూఢిల్లీ లేఖ

19.6.70 పత్రికలో ప్రచురించిన శ్రీ కృష్ణగారి న్యూఢిల్లీ లేఖలో ముసల్మానుల గురించి వ్రాసిన వ్యాసం చదివిన నాకు చాల బాధ కల్గించింది. నాకే కాదు. అది చదివిన ప్రతి ముస్లింకు ముస్లిమేతరులకు కూడా బాధ కలిగి యుంటుంది. అసలు ఆయన వ్యాసంవల్ల అణగారిన మతోన్మాదం తలెత్తటానికి ఆస్కారం వుంది.

బహుశా ఆయన వుద్దేశ్యంలో భారత ప్రభుత్వం ముసల్మానులను ఐ. ఎ. యస్. పరీక్షలకు కూర్చోనివ్వకుండా ఆంక్ష విధించాలి. ఆ విధంగా ముస్లింలు ఇండియన్ ఎడ్మినిస్ట్రేషన్‌లో వున్నతోద్యోగాలకు అర్హులు కాకుండా పోవాలని ఆయన ఆకాంక్ష.

ఇంకా ఆయన— ఆలీఘర్ విశ్వవిద్యాలయంలో చదువుకున్న ముసల్మానులు ఎందరు భారతదేశంలో వుండిపోతున్నారు?— అని ప్రశ్నించారు. అంటే ఆయన వుద్దేశ్యంలో ఆలీఘర్ విశ్వవిద్యాలయంలో చదువుకున్న వారంతా పాకిస్తానుకు వెళ్లిపోతున్నారు — అని. సరే.. .. వెళ్లిపోతున్నారు— ఎలా వెళ్తున్నారు, ఎవరు? అంత పబ్లికుగా పాకిస్తానుకు వెళ్ళనిస్తున్నారు? దీనికి జవాబు!!?

— "భారతదేశంలో మర్యాద కుటుంబాలకు చెందిన ముసల్మానులే లేరా? ఉంటే, ప్రతి రెండవ ముసల్మానూ పెళ్లి సంబంధాలకోసం పాకిస్తాను వైపుకు చూపు మరలుస్తాడెందుకు?"— అని ఒకచోట వ్రాశారు. ఇది ఎంత హాస్యాస్పదమైనదో చెప్పనలవి కాదు. ఈ వాక్యం భారతదేశంలో వున్న ముసల్మానుల గుండెల్లో నేరుగా దూసుకుపోయి విలవిల్లాడేట్లు చేస్తుంది. ఆయన వుద్దేశ్యంలో ఈ పవిత్ర భారత్‌లోవున్న మర్యాదగల కుటుంబాలు కొన్ని పాకిస్తానుపోగా మిగిలిన కొన్ని కుటుంబాలు

# క్రొత్త మర్ఫీ ముసాఫిర్ 400




రు. 293*

*వెల ఎక్సైజు డ్యూటీతో సహా—సేల్సు టాక్సు అదనం.

## మర్ఫీ ముసాఫిర్ ఘనతను గురించి ఏం చెప్పాలి! ముసాఫిర్ 400 రూపంలో ఇప్పుడు 4 బ్యాండ్‌లలో లభిస్తోంది.




క్రొత్త మర్ఫీ ముసాఫిర్ ఎంతో శక్తివంతమై మీరు కోరిన స్టేషన్—తగినంత బలమైనది కానియ్యండి కాకపోనియ్యండి —ఎంతో స్పష్టంగా, మధురంగా వినగల్గుతారు. షార్ట్ వేవ్ మీద కూడా తేలికగా ఎన్నో స్టేషన్‌లను ఈ ట్రాన్సిస్టరు మీకందించ గల్గుతుంది. ఎందువల్ల నంటే మొదట్లో కేవలం రెండే షార్ట్ వేవ్ బ్యాండ్లు ఉండేవి: ఇప్పుడు క్రొత్త మర్ఫీ ముసాఫిర్ లో మూడు షార్ట్ వేవ్ బ్యాండ్లు ఉన్నాయి.

క్రొత్త మర్ఫీ ముసాఫిర్ 400 మీద రేడియో కార్యక్రమాలు ఎటువంటి యితర ఆటంకపరచే ధ్వనులు లేక ఎంతో హాయిగా ఆనందంగా వినవచ్చును. ఫ్లోరసెంట్ ట్యూబు లేక డి. సి. ఎలక్ట్రిక్ మోటర్ మొదలైన వాటినుండి కలిగే బయటి ఆటంకములు కూడా చాలా తక్కువగా ఉంటాయి. దీనికంతా షార్ట్ వేవ్ రిసెప్షన్ కొఱకు క్రొత్త మర్ఫీ ముసాఫిర్ లో ఏర్పాటు చేయబడిన మ్యాగ్నెటిక్ లూప్ ఏరియల్ కారణం.

ఇంతేకాక క్రొత్త మర్ఫీ ముసాఫిర్ 400 పొందుపుగా ఎక్కువకాలం పనిచేసే తేలికగా లభించగల డ్రై బ్యాటరీల పై పని చేస్తుంది.



మర్ఫీ

NAS 365

మర్యాద గలవి— ఇక ఆ తర్వాత మిగిలిన కోట్ల కొలది ముసల్మానులు అమర్యాదగలవాళ్ళు.

ఇక— "రాజధానిలో రాయబార వర్గాలుండే పేటలో ఎందరో ముసల్మానులు నమాజుకోసం పాకిస్తాను రాయబారవర్గం లోపలవున్న మసీదుకు వెళ్తారు—.

అక్కడ తప్ప ఎక్కడా మసీదుల్లేవా?

రాజధానిలోనే ముసల్మానులకు యిటువంటి తరిఫీదు లభిస్తుంటే ప్రభుత్వం ఎందుకు వూరుకుంటుంది?" అని వ్రాశారు.

ఎంత హాస్యాస్పదమైన ప్రశ్న! దగ్గర్లో వున్న మసీదుకు అక్కడే దరిదాపులో వున్న ముసల్మానులు నమాజుకు పోవటం అక్రమమా? లేక భారత దేశంలో మత స్వాతంత్ర్యం లేదా!? అని నేనడుగుతున్నాను.

ఏం? ఎవరైనా ఇంటి ప్రక్కనున్న వెంకటేశ్వరునికోవెల వదలి ఎక్కడో రెండుమైళ్ళదూరంలో వున్న గుడికి, పూజకు రోజూ వెళ్తారా?

ఏం?— రాజధానిలో వున్న ముసల్మానులంతా తమకు దగ్గరగావున్న మసీదులు వదిలి దూరంగా వున్న రాయబారవర్గ మసీదుకే నమాజుకై వెళ్తున్నారా?

ఏం? భారతదేశంలో వున్న ముసల్మానులు ఎప్పుడు ప్రభుత్వానికి ద్రోహం చేశారు? 1965 లో పాకిస్తానుకు, భారత్‌కు యుద్ధం సంభవించినప్పుడు భారతదేశపు ముసల్మానులు చేసిన ప్రాణత్యాగాలు [భారత్‌కై], ధన, కనక సహాయం శ్రీ కృష్ణగారు మర్చిపోయినట్లున్నారు.

అవును. భారత దేశంలోవున్నవన్నీ అమర్యాద



# ఉత్తరాలు

కుటుంబాలే! వాళ్ళు ఎవరేమన్నా కుక్కిన పేనుల్లా పడి వుంటారు. స్వజాతీయులైన పాకిస్తానీయులే భారతదేశంలో వుంటున్న ముస్లింలు— అసలు ముస్లింలే కారన్నప్పుడు, ఇక్కడున్న ముస్లింల మర్యాదంతా మంట గలిసి పోయింది. అందుకే ఇప్పుడు పవిత్ర భారత్‌లోనే పత్రికాముఖంగా బాహాటంగా "హిందూదేశపు ముస్లింలు అమర్యాదస్తులు" అని అనగల్గుతున్నారు.

శ్రీ కృష్ణగారు తెలుగులో— వ్యాసరూపంగా నిరపరాధులైన ముస్లింలను అపరాధులుగా సృష్టించారు. ఎందుకు?— దక్షిణాది ముస్లింలు శాంత స్వరూపులు, వాళ్ళపై ఎటువంటి నిందలు మోపినా కిక్కురుమనకుండా వుంటారు— అని భావించారు. ఇది అన్యాయం.

ఇదే వ్యాసాన్ని మరే ఉత్తరాది భాషలలోగాని, ఆంగ్లంలోగాని వ్రాసియుంటే!— వాటిపై వచ్చే వేలకొలది ఘూపైన విమర్శలకు తట్టుకోగలరా?

అర్థజ్ఞానంతో, మతతత్వాలను రెచ్చగొట్టే విషయాలను లిఖితపూర్వకంగా ఇకముందు ప్రచురణ చేయరని ఆశిస్తున్నాను.

భవదీయుడు,
—యస్. నజీర్
[ఖర్గపురం]

*శ్రీకృష్ణ మాతృభాష తెలుగుకాదు—సం.

* * *

"ప్రజల ఖర్చుపై పై మంత్రుల విలాస యాత్రలు" అనే శీర్షికతో శ్రీ కృష్ణగారి న్యూఢిల్లీ లేఖ చాల బాగుంది. ప్రజలకు విషయాలు విపులముగా వివరిస్తూ వినయముగా విముఖత చూపిస్తూ వ్రాశారు. విలాసయాత్రలు చేస్తున్న మంత్రుల చెవులలో యీ విషయం పడ్డదంటే మనసు వికలమవ్వక తప్పదు.

న్యూఢిల్లీ లేఖలో నూతన విషయాలను తెలుపుతూ యున్న శ్రీ కృష్ణగారికి నా అభినందనములు.

శ్రీమతి రమాదేవిపాండే 'కిరన్'
[రాయచూరు.]

* * *

5-6-70 సంచికలో ఎస్. రాజారావు (మద్రాసు)గారు రాయలసీమలో ఒక విమానాశ్రయము స్థాపించుట అత్యవసరమని వ్రాశారు. సుమారు 70 సంవత్సరముల క్రిందట కడపలో ఆంగ్లేయులు విమానాశ్రయము స్థాపించారు. మంత్రి శ్రీమతి రోడామిస్త్రీ గారు ఇచ్చట విమానాశ్రయమును చూచి ఇంతటి పెద్ద భవనము, ఇంతటి విశాలమైన మైదానము విజయవాడ గన్నవరంలోకూడా లేదే! యని ఆశ్చర్యపోయారు. రాయలసీమలో కడప పెద్ద వ్యాపారకేంద్రము. మద్రాసు—హైదరాబాద్ వెళ్ళే విమానములు ఇచ్చట ఆపినచో, రాయలసీమ ప్రాంతివాసులకు ఉపయోగకరంగా ఉంటుంది.

అలాగే కడప రేడియోకేంద్రమునుండి పగటి పూట కార్యక్రమములు ప్రసారంచేయుట అవసరము. ఎస్. సత్యనారాయణ (కడప)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 3-7-'70
[శ్రీ సాధారణనామ సం॥ ఆషాఢ మా॥ బ॥ అమావాస్య]
సంపుటము: 63 సంచిక: 42

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

# కుడికమ్యూనిస్టుపార్టీ అనుగ్రహం: సోషలిజమ్ అంటే?

కొన్ని రోజుల క్రితం కమ్యూనిస్టు నాయకుడు శ్రీ భూపేష్‌గుప్త హరిద్వారంలో మాట్లాడుతూ అన్నారు, భారత్ భారీ విద్యుత్ కర్మాగారం కార్మికుల కోరికలని గనుక మన్నించకపోయినట్లయితే తమ పార్టీ లోకసభలో జూన్ 19వ తేదీనాడు, మేడమ్ ఇందిరాగాంధీ ప్రభుత్వంమీద విశ్వాస రాహిత్య తీర్మానాన్ని ప్రయోగించ తప్పదు, అని. "ఇందిరాగాంధీ ప్రభుత్వం ఆయుస్సు మా మద్దత్తుమీద ఆధారపడి వుంది. కార్మికుల ధర్మమయిన కోరికలని తీర్చేదాకా ప్రభుత్వానికి ఈ మద్దత్తు ఉంటుంది" అని కూడా ఆయన అన్నారు.

"ప్రభుత్వానికి మా మద్దత్తు ఎంత అవసరమో రెండవ భత్యాల సంఘంలో మేము కోరిన మార్పులకి ప్రభుత్వం అంగీకారమే తెలుపుతుంది. అలాగే పశ్చిమ బెంగాలులో నేర నిరోధక చట్టాన్ని అమలు పరచే సంకల్పాన్ని మార్చుకున్నారు"

## సవాలు

ఈ వాక్యాలలో ఒక అర్థం స్ఫురిస్తుంది. ప్రభుత్వోద్యోగులనీ, ఇతరులనీ తమని [కమ్యూనిస్టులని] ఆశ్రయించవలసిందిగా ఒక సూచన ఇందులో కనపడుతుంది. కమ్యూనిస్టులు మాత్రమే భారత దేశాన్ని పాలించదగ్గవారనే అర్థం కూడా ఇందులో స్ఫురిస్తుంది. చీలిక రాకముందు మేడమ్ గాంధి గారు ఈ సవాలుని ఎదురుకుంటున్నట్లుగా ప్రకటిస్తూ ఉండేవారు. ఈ సవాలు కాంగ్రెసువారి వద్దనుంచే వచ్చేది. నేడు అది కమ్యూనిస్టుల వంపునుంచి వస్తున్న సవాలు. మేడమ్ ఇందిరా గాంధిగారు కమ్యూనిస్టు సవాలుని ఎదుర్కొన గలుగుతారా? లేక పదవిని రక్షించుకొనటానికి మళ్ళీ తలవంచుతారా?

నిజానికి బాబూ భూపేష్ గుప్త ఎంతో నిదానంగా మాటాడారనవచ్చు. రయిల్వే బడ్జెటుని కమ్యూనిస్టుల కోసం మార్చారన్న సంగతిని గురించి ఆయన చెప్పలేదు.

శ్రీ జగ్జీవన్‌బాబుగారి అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం మహాన్నాళి ముచ్చటగా జరిగింది. విదేశ వ్యవహారాల మంత్రి శ్రీ దినేష్‌సింగ్ ప్రధాన మంత్రితోబాటు ప్రజలకి కనిపిద్దామని ప్రయత్నించి విఫలులయ్యారు. సర్దార్ స్వరణ్ సింగ్ రక్షణ శాఖామంత్రి, కాని, విదేశవ్యవహారాల చర్చని ఆయనే ప్రారంభించారు. శ్రీ దినేష్‌సింగ్‌కి ఇందులో పాల్గొనే అవకాశం కూడా లేకపోయింది. భారతదేశానికి సోవియట్ రష్యా అంటే అపారమయిన భక్తి. అందువల్లనే కాంబోడియాలో అమెరికన్ సేనలు ఉండరాదని భారతదేశం కోరింది. చెకొస్లొవాకియాలో రష్యా సేనలు ఉండరాదనీ మాత్రం కోరలేదు, ఎందుకో.....

తమిళనాడునుంచి శ్రీ సి. సుబ్రమణ్యం, ఉత్తర ప్రదేష్‌నుంచి పండిట్ మాలవీయా ఆవేశంగా ఉపన్యాసాలు చేశారు. శ్రీ సుబ్రమణ్యం వామపక్షాలు కలియాలి అన్నారు. పండిత మాలవీయా, 'తమ జీవిత కాలంలో సోషలిజమ్ భారతదేశంలో స్థిరపడ పోబోతున్న'దని సంతోషించారు.

## ప్రజానాయకులు

ఇద్దరూ ప్రజా నాయకులు. అందుకనే వరుసగా రెండుసార్లు ఎన్నికలలో ఓడిపోయారు. [ఒకసారి సార్వత్రిక ఎన్నికలలో రెండవసారి ఉప-ఎన్నికలలో.]

శ్రీ మోహన్ ధారియా జగజీవన్‌రామ్‌మీద ఉద్యమం ఒకటి లేవదీస్తున్నారు. దీనికి తమమద్దతు లేదని నిరూపించటానికి శ్రీ యశ్వంత రావు వసంత రావు చవాన్ [హోం వ్యవహారాల మంత్రి] తామే శ్రీ ధారియాని మందలించారు. శ్రీ ధారియా తమ ఉద్యమం జోరు తగ్గించారు. శ్రీ జగ్జీవన్‌రామ్



**ఖయిరతాబాదు ఉప ఎన్నికలో తెలంగాణా ప్రజాసమితి అభ్యర్థిగా ఘనవిజయం సాధించిన శ్రీ నాగం కృష్ణారావుగారు. [ఈ ఎన్నికలో కాంగ్రెసు (అధికార) అభ్యర్థి శ్రీ ఎన్. యాదగిరికి 10399 వోట్లు రాగా శ్రీ కృష్ణారావుగారికి 24391 వోట్లు వచ్చాయి.]**

వ్యంగ్ర తివర్గంను చి తప్పు నక్కరలేదన్నారు. క్షేమంగా శ్రీ చవాన్ అధికారం, పోషణ తగ్గి పోతున్నాయి. జూలయి ఒకటవ తారీకు నుంచి 'ఉద్యోగ కార్యదర్శి [పర్సనల్ సెక్రెటరీ] ఒకరి నియామకం జరుగుతుంది అంతే ఉద్యోగులమీద అంతరంగిక వ్యవహారాల మంత్రి అధికారం ఉండబోదన్న మాట.

కొన్ని రోజుల క్రితం రా. స్వ. సే. సం. అధినేత శ్రీ గోల్వాల్కర్ తమ సంస్థని నిషేధించటం ప్రభుత్వానికి తగదని హెచ్చరించారు.

అఖిల భారత కాంగ్రెసు సమావేశం జరుగుతుండగా జనసంఘం కూడా పెద్ద సభ జరిపింది. దానికి లక్షమందికి పైగా జనం వచ్చారు. జనసంఘం నాయకులు నిదానంగానే మాటాడారు కాని వారి అసలు ఉద్దేశం తమ అనుచరుల సంఖ్య తక్కువ కాదని నిరూపించటమే!

## బాద్‌షాఖాన్ వ్యాఖ్య

బాద్‌షాఖాన్ సంగతి— టీవలే ఆయన కాబూల్‌లో ఒక పత్రికా విలేఖరితో మాటాడుతూ, పాకిస్తాన్‌ని భారతదేశంతో దౌత్యసంబంధాలు వదులుకోమని తాము చెప్పినట్లుగా వెల్లడించారుట. భారతదేశంలో మత కలహాలు రగిలినందుకు పని చెయ్యమని ఆయన సూచించినట్లుగా తెలుస్తుంది. ఎందరో భారతీయ మహమ్మదీయులు తమకి వేలకి వేలు ఉత్తరాలు రాస్తున్నారుట. బాద్‌షా ఖాన్ చెప్పారుట. తమ మతాన్ని 'భారతీయం' చెయ్యాలని కొందరు చూస్తున్నారని వారు చెప్పారుట.

బాద్‌షాఖాన్ 'లౌకిక [సెకులర్] వాదాన్ని వదులుకుంటున్నట్లు తోస్తుంది. ఎందుకంటే, తూర్పు పాకిస్తాన్ నుంచి వారానికి రెండు వేలమంది హిందువులు పారిపోయి వచ్చేస్తున్నారు కాని ఆయన దానిని గురించి ఏమీ చెప్పలేదు.

## 'భారతీయం' అని అన్నది ఎవరు?

భారతదేశంలో ముసల్మానులని హింసించాలని ఎవరూ అనరు కాని ఇస్లామ్‌ని 'భారతీయం' చెయ్యాలని ఎవరు అన్నారు? జనసంఘంనాయకులు కొందరు అన్నది ఏమిటంటే భారతీయ ముసల్మానులు పాకిస్తాన్ దయకోసం ఆకులాడ రాదని మాత్రమే.

నక్సలయిట్ల ఖండన విషయంలో సంకోచం చూపించటం కూడా అఖిల భారత కాంగ్రెసు సమావేశం విశేషాలలో ఒకటి.

ఈ సంకోచం పశ్చిమ బెంగాలు అభ్యర్థులు కొందరికి నచ్చలేదు. నక్సలయిట్లు, మతదురభిమానులు— ఇద్దరూ ప్రమాదానికి కారకులే, అయినప్పటికీ ఒక వర్గం వారిని మాత్రమే

ఖండించటం పక్షపాతాన్ని నిరూపిస్తున్నదని కొందరు అనుకున్నారు. మతదురభిమానుల ఖండన విషయంలో తీర్మానాలు పదునుగా ఉన్నాయి కాని నక్సలయిట్ల విషయంలో మెత్త పడి పోయాయి.

రా. స్వ. సం., జమాత్—ఎ—ఇస్లామీలు సమాజంలో ద్వేషం, హింసలని పెంపొందిస్తున్నాయని పార్టీ ప్రకటనలు ప్రభుత్వాన్ని హెచ్చరించాయి. నక్సలయిట్లని మాత్రం వదిలి వేశాయి. రాజకీయ తీర్మానం కేవలం, "యువజనాన్నీ, మేధావులనీ, కర్షకులనీ, కార్మికులనీ" పార్టీలో చేరి "ప్రజలకి కొత్త ఉత్సాహాన్నీ వేగాన్నీ" ప్రసాదించమని కోరింది. శ్రీమతిగాంధీ మత ప్రమాదాలని గురించి వివరంగా మాట్లాడారు—దీనిని పశ్చిమ బెంగాలు సభ్యులు గమనించక పోలేదు.

## నక్సలయిట్లు...

దీనంతటినీ బట్టి మనం గ్రహించగలిగింది ఏమిటంటే పయి కాంగ్రెసు సమావేశంలో కొందరు మత దురభిమానుల విషయంలో దండోపాయం తప్పదంటూ నక్సలయిట్ల విషయంలో మాత్రం నీళ్ళు నమిలి వేశారని.

మత దురభిమానులనీ, నక్సలయిట్లనీ కలిపి చర్చించ రాదని శ్రీ చంద్రశేఖర్ అభ్యంతరం చెప్పారు. ఆయనకోసం తీర్మానాన్ని కొంత మార్చారు. ఇక నక్సలయిట్ల ఆధారం విద్యార్థి, కర్షక వర్గాలలోనే ఉంది అనటం వల్ల నక్సలయిట్లకి 'గ్లామర్' వస్తోందని కొందరు భయపడ్డారని వినికిడి, ఈ విధంగా హింస, అల్లర్లకి ప్రాముఖ్యత రావచ్చునని ఈ రకంవారు అన్నారుట. వీరి వాదాన్ని పార్టీలో అధిక సంఖ్యాకులు పట్టించుకోలేదు. శ్రీయుతులు దినేష్‌సింగ్, సిద్ధార్థశంకరరాయ్, సుఖాడియా, శ్యామాచరణ శుకా లు మాత్రం కొంత తీవ్ర విమర్శ చేశారు.

కమ్యూనిజం అంటే ఏమిటో శ్రీ డాంగేకి తెలుసు. సోషలిజమ్ అంటే ఏమిటో కాంగ్రెసుకి తెలుసా?

## కొత్త కాంగ్రెసు సోషలిజమ్

'కొత్త కాంగ్రెసు' మార్కు సోషలిజమ్ అంటే ఏమిటి? పయిన చెప్పిన కాంగ్రెసు సమావేశానికి 400 చిల్లర ప్రతినిధులు వచ్చారు. వారికి తమ సోషలిజమ్ ఎటువంటిదో తమకే తెలీదు. చర్చలకీ, సమాలోచనలకీ మాత్రం కొదువ లేదు.

అప్పటికీ కొందరు ప్రతినిధులు అడగనే అడిగారు—'మీ సోషలిజానికీ, శ్రీ నిజలింగప్ప సోషలిజానికీ తేడా ఏమిటి??' అని ఈ ప్రశ్నకి, సమాధానంగా శ్రీ చవాన్ అన్నారు—'మా కాంగ్రెసు యొక్క సోషలిజమ్ వేరు కాబట్టే శ్రీ నిజలింగప్ప రెండవ కాంగ్రెసులో ఉన్నాడు'' అని.

ఎందరో ప్రతినిధులకి పార్టీ సందేశాన్ని ప్రజలలో చాటాలని ఉబలాటంగా ఉంది. కాని, శ్రీ చవాన్ చెప్పినటువంటి సమాధానాలు వారికి అర్థం కావు. ఇదంతా వామ పక్షం విధానమా, దక్షిణ పక్ష విధానమా లేక అంతర్జాతీయపక్ష విధానమా? వారికి నిజంగానే అంతా అయోమయంగా ఉంది. అనవచ్చు. పార్టీ పెద్దలు చేసిన తీర్మానం 'కుడి పయిపునుంచి వచ్చే రియాక్షన్' నీ 'ఎడమ పయిపు నుంచి వచ్చే దుస్సాహసా'న్నీ కూడా ఖండించింది...

ఈ రకం అయోమయ పరిస్థితి చిన్నవారికేనా అంటే అదీ కాదు. శ్రీ వి. కె. ఆర్. వి. రావువంటి సీనియర్ మంత్రి కూడా పార్టీ ఏ రకం సోషలిజాన్ని బలపరుస్తున్నదో తెలియాలనే సవరణని ఒక దానిని ప్రతిపాదించారు. 'మనం సోవియట్ యూనియన్ బానిసల'మనే అపోహని తొలగించాలని ఆయన అన్నారు. ఈ అపోహలని పుట్టించే వారు పార్టీ శత్రువులు కాబట్టి కావాలనే చేస్తున్నారన్నారు. శ్రీ రావు సవరణకి శ్రీ సుబ్రమణ్యం అంగీకరించలేదు. తీర్మానం చదివితే, "ప్రజాస్వామ్య పద్ధతులనీ, సోషలిస్టు విధానాలనీ సమ్మిళితం చెయ్యా''లని స్పష్టంగా ఉందన్నారు.

మాజీ మంత్రి పండిత మాలవీయా తీర్మానాన్ని బలపరుస్తూ 'భారతీయ సోషలిజాన్ని అంతర్జాతీయ సోషలిజంతో ముడిపెట్టాలి' అన్నారు. ఈ సూచనల అయోమయ పరిస్థితి ఎక్కువ అయింది. "భారతదేశంలో ఉన్నటువంటి స్థితిగతిని బట్టి సోషలిజానికి ఎన్నో అర్థాలు తియ్యవచ్చు'' అన్నారు శ్రీ చవాన్. అధికారయుతమయిన 'ప్రకటన' ఇదొకటే.

రెండు వారాలక్రితం 'కొత్త' కాంగ్రెసు ప్రదేశ నాయకులు రహస్యంగా సమావేశం అయి ఏ విషయాన్నీ నిర్ణయించలేకపోయారు. అసలు భావాలు స్పష్టం అయ్యేందుకు 'అగ్ర సమావేశం' ఒకటి ఏర్పాటు చెయ్యాలని కొందరు అన్నారు. నాయకులే నిర్ధారణ చెయ్యలేనప్పుడు అనుచరుల మాటేమిటి?

## ఎన్నో రకాలు

సోషలిజానికి ఎన్నో అర్థాలు ఉన్నాయి నిజమే. ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క అర్థం. శ్రీ కృష్ణమీనన్‌కి రెండు ఇళ్ళు ఉండేవి. ఢిల్లీలో ఎందరికో ఒక ఇల్లు కూడా ఉండేది కాదు. ఆయన వాకూనా అనే ఉన్ని తప్ప వాడేవారుకారు. ఇది అన్నిటికన్నా ఖరీదయినది. ఒక సోషలిస్టు మంత్రిగారు చేతికి వేసుకునే ఉంగరాల విలువ రు. 75,000మాత్రమే ఉంటుంది. ఈ విధంగా బీద—గొప్ప తారతమ్యాన్ని తగ్గిస్తున్నారు—తమకీ బిర్లాలకీ ఉండే తారతమ్యాన్నేమో......

నక్సలయిట్లని గురించి మాట్లాడిన కొద్దీ వారి గ్లామరే పెరుగుతుంది అన్నారు శ్రీ చంద్రశేఖర్. మత దురభిమానులని గురించి మాటాడితే వారి గ్లామర్ పెరగదా? ఈ రకం సిద్ధాంతాల సహాయంతో పాకిస్తాన్‌కి మంచి చేయూత ఇస్తున్నారు మన నాయకులు. బాద్‌షాఖాన్ ప్రకటన, పాకిస్తాన్ ప్రచారం—ఇవే దీనికి నిదర్శనాలు.

ప్రభుత్వం రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘాన్ని మాత్రం నిషేధించి అకాలీదళం, జమాత్—ఎ—ఇస్లామ్‌లని ఊరికెనే వదిలివేస్తుందా? శ్రీ జగజీవనరామ్ కాంగ్రెసు చిత్తశుద్ధి ఎటువంటిదో భవిష్యత్తే తెలుపగలదు.

# రచయితలకు మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాతప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాతప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్ళలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్రసచిత్రవారపత్రిక*

# ఒక వారం విపరీతం
ఫాలాక్షుడు

## రాక్షసికాండ

కొడక్కల్ అనే గ్రామంలో జరుగుతున్న ధర్మరాజు గుడిఉత్సవం చూసి, అదే వూరుకు చెందిన, రంగస్వామి యింటికి బయలుదేరి వెళ్తుండగా దారిలో అతని విరోధి సుబ్రహ్మణ్యం ఎదురొచ్చి, పొంచి మెడమీద, ముఖం మీద కొట్టి, క్రిందపడేసి, గుండెమీద, మెడమీద, కడుపుమీద కాళ్ళతో బలంగా తన్ని అతి క్రూరంగా చంపేశాడట. ఈ రాక్షసి కాండకు కారణం పగ అని తెలిసినా, ఆపగకి కారణం మాత్రం వివరంగా తెలియలేదు.

## గాడిద-జీబ్రాల దాంపత్యం

జపానుకు చెందిన అసాహికావా అనే చోట జంతు ప్రదర్శనశాలలో రోజా అనే వో జీబ్రాకూ, గాడిదకూ సంపర్కం కలిగించారట. తత్ఫలితంగా




వో ఆడపిల్ల జీబ్రాకు పుట్టిందట. ఆపుట్టిన పిల్ల తల్లిని పోలిన శరీరం, తండ్రి [గాడిద] ని పోలిన చెవులు కలిగి వుందట. డాంకీ [గాడిద] జీబ్రాలకు పుట్టిన యీ పిల్లకు డోబ్రా అనే పేరు పెట్టారట. వుప్మాలో టమోటా ముక్కలు వేసి, అదేమంటే ఒకసలుడు ఆ సమ్మేళనాన్ని టోప్మా అనెను.

## వోట్ల దొంగతనం

గుంటూరుకు చెందిన నంబూరు అనే వూరిలో పంచాయతీ ఎన్నికల వోట్లు లెక్కపెట్తుండగా కొంతమంది ఆ వోట్లను తస్కరించడానికి వారిమీద పడ్డారట. వోపిక వచ్చిన పోలీసులు చేసినకాల్పుల్లో వో యిద్దరు చనిపోయారట.

* * *

## పొరపాటు-కత్తిపోటు

పనికివెళ్ళి, ఏపనీ చేయక, ఆరోజు డబ్బు సంపాదించక, యింటికి వచ్చిన పూరన్ అనే అతను అన్నం వడ్డించమని భార్యను అడిగాడట. దమ్మిడీ సంపాదించక అన్నం పెట్టమని దర్జాగా వచ్చిన భర్తను ఆమె గౌరవించక, అన్నం వడ్డించలేదట. దాంతో అన్నగారికి జరుగుతున్న అవమానాన్ని సహించలేక గుండన్న వో కత్తి దూసి, వదినగారి మీదికి లంఘించే సరికి పూరన్ భయపడి, అడ్డు వెళ్ళే సరికి ఆ కత్తి పోటులు, వేట్లు అతనికే తగిలాయట.

## విద్యార్థి ఆత్మహత్య (?)

మాస్కోవెళ్ళి పాట్రిస్ లుముంబా విశ్వవిద్యాలయంలో నాలుగో సంవత్సరం మెడిసన్ చదువుతున్న అనంతపురా[ని]కి [ఆంధ్ర] చెందిన యు.సుబ్బారావు అనే యువకుడు తన కుటుంబ స్థితిగతుల నుంచి తప్పించుకునేందుకు తానే ఆత్మహత్య చేసుకుంటున్నట్టు వుత్తరం రాసి, వురిపోసుకుని చనిపోయాడట.

## సర్పం సరదా

వూరు చూడామన్న సరదాతో వో పెద్ద ఆరడుగుల పాము లగార్పూర్ అనే గ్రామంలో చొరబడిందట. దాంతో ఆ ప్రాంతంలో వున్న కుక్కలు, పిల్లులు, వూరి ప్రజలూ కలసి భయంతో ఆపాముని చంపడానికి రాళ్ళేసి కొట్టేసరికి పాము సరసరలాడుతూ పక్కపొలంలోకి వెళ్ళి అక్కడ పని చేసుకుంటున్న 22 ఏళ్ళ చందర్ అనే అతని కాళ్ళకు చుట్టుకుందట. చందర్ తన చేతిలోని గునపంతో ఆ పామును చావబాదాడట— మృత్యుభయం రాక్షసి బలాన్నిస్తుందంటారు—కిమాశ్చర్యం!

* * *

పెళమారన అళ్ళి అనే గ్రామంలో మునుసామి అనే వో 25 ఏళ్ళవ్యక్తి తన భార్య ప్రవర్తన మీద అనుమాన పడి ఆమెను హెచ్చరించాడట. భర్త హెచ్చరింపుకు ఆమె దడవక, యథాప్రకారం తన ప్రవర్తన నలాగే వుంచుకునే సరికి ఆవేశంతో ఆమె పీకనులిమి, చంపేశాడట.

## చావని నేరం

కాట్టు మలయనూరుకు చెందిన కుళ్ళమ్మ అనే ఆమె భర్త ఏడాది క్రితం చనిపోయాడట. ఆనాటి నుంచీ భర్తవైపు చుట్టం ఆళడియాన్ అనే ఆయన ఆమె బాగోగులు విచారిస్తూ వస్తూ పోతూ వుండేవాడట. ఇది అంతేకాదని, ప్రేమాయణంలోకి దిగిందనీ ఆ వూరివారంతా పంచాయితీ చేశారట. గ్రామాధికారి ఆళడియాన్‌కి ఎనభై రూపాయలు అపరాధం విధించి "ఇంకెన్నడూ ఆ వెళ్ళకు" అని ఆజ్ఞాపించాడట. ఒకనాడు పొలంలో ఒంటరిగా కనుపించిన కుళ్ళమ్మను అతను తన కోర్కె తీర్చుకోడానికి బలత్కరించేసరికి ఆమె వారించిందట. ఆవేశంతో ఆళడియాన్ ఆమె పీకకోసి అదేకత్తితో తన పీకా తెగ్గోసుకున్నాడట. ఎటొచ్చీ యిద్దరూ చావనందువల్ల పోలీసులాతనిమీద హత్యా, ఆత్మహత్యా ప్రయత్నం అనే నేరాలను మోపిందట—

## నక్సలైట్ స్త్రీ

మిడ్నపూరులో ఒక కుటుంబనియంత్రణ కార్యాలయంలో నక్సలైటులని చెప్పబడే వో ముగ్గురు చొరబడి, "మీ పనులు యీ పాటికి చాలు ఆపండి అని మేము వుత్తరం ద్వారా చేసిన హెచ్చరికను ఎందుకు పాటించలేదు?" అని అడిగి, జవాబుకోసం చూడక, అక్కడున్న టేబుళ్ళు, బల్లలూ, కుర్చీలూ విరగ్గొట్టి నిప్పంటించి వెళ్ళిపోయారట— మరి పోలీసులేంచేస్తున్నట్టు—ఆ ముగ్గురిలో గంగ సిందూరం రంగు బొట్టుపెట్టుకున్న అమ్మాయి ఒకతె కూడ వుందని, యింతవరకూ, అఘాయిత్యాలలో నక్సలైటుస్త్రీ పాల్గొనడం యిదే ప్రప్రథమ మనీ చెపుతున్నారు. భేష్!



## విధవా సంబంధం

ంగంపేటలో వెంకటరమణారెడ్డి అనే ఆయన ఇద్దరి కూతుళ్ళతో విధవయిన పెద్ద కూతురు [21 సంవత్సరాలు] అదే వూరుకు చెందిన వో వ్యక్తితో అక్రమ సంబంధం పెట్టుకుందట. ఈ సంగతి తెలిసిన మల్లయ్యారెడ్డి [ఆమె చిన్నాన్న] తన వదిన గారు ఎర్రమ్మను నడిరోడ్డులో పట్టుకుని హీనంగా మాట్లాడేసరికి ఆమె అభిమాన పడి, పెద్ద కూతురు గంగులమ్మను, రెండో కూతురు [16 ఏళ్ళు] సదు ఇనూ నూతిలో తోసేసి, నూ దూకి ఆత్మహత్య చేసుకుందట— మనస్సు గాజుకన్నా సున్నితమైనది, వెన్నకన్నా మృదువైనది అని కదా పెద్దన్నారు!

## తాగుడుం తిమ్మిరి

బాగా తాగినవాళ్ళకసలు వంటిమీద ఎంతవరకూ స్పృహవుండదనే విషయం మీద అది తేలదనిక బెం




డక్కరలేదు. వెస్టు జపాన్— టోక్యోలో ఒకాయన వాయువేగంతో కారుతోలుకు పోతున్నాడట. ఎదురుగా మరో ట్రక్కు అంతకు తీసిపోని వేగంతో మాసుకు వెళ్ళిపోయిందట. ఆ బండి ఇంచుమించుగా తన కారును తాకుతూ పోడంవల్ల తనకుగానీ, తన కారుకుగానీ ఏమైనా నష్టం సంభవించిందా అని ఆయన ఆశ్చర్యపోయి, విషయం తేల్చుకునేలోగా వారిన పోయే దానయ్యకు నడి రోడ్డులో వో కుడి చెయ్యి దొరికిందట. అది పోలీసుల కాయన తెలియజేశాడట. ఆ కారులో ఆయన వో మైల దూరం వెళ్ళి చూసుకునేసరికి తన కుడి చెయ్యి ఏమయ్యిందో తెలియలేదుట. ఇదేమిటని ఆయన పోలీస స్టేషనుక వెళ్ళేసరికి తన కుడిచెయ్యి అక్కడుందట. ఆ సమయంలో ఆయన పీకమొయ్య తాగివుండడం వల్ల ఆ మత్తులో చేయి వూడిపోయినా తెలియలేదని శరీరమంతా తిమ్మిరి ఎక్కివుందనీ డాక్టర్లన్నారు, —అర్థమయ్యిందా! షో డ్రింకింగిజె గుడ్హాబిట్!







పద్మనాభరావుకి అంతులేని ఆస్తి వుంది. అయినా ఎంతోకాలంగా సంతానం లేదు. భార్యతోసహా తీర్థయాత్రలు చేశాడు. రామేశ్వరంలో నాగప్రతిష్ఠ చేశాడు. ఒకగుడి కట్టించాడు. కనపడ్డ స్వాములందరికీ మ్రొక్కాడు — ఎన్నో వ్రతాలు చేశారు—నోములు నోచారు. అతను ఏడాది 'సిద్ధమకరధ్వజం' తిన్నాడు— అతని భార్య వసంతకుసుమాకరం సేవించింది. దేవుడు దయతల్చాడు — పెళ్లి అయిన 14 ఏళ్లకి గర్భవతి అయింది. నెలతప్పిన నాటినుంచీ యిల్లే హాస్పిటలై పోయింది.

ఆనాడామె ప్రసవవేదన పడుతోంది. వూళ్లోవున్న పెద్ద లేడీడాక్టర్లు అంతా అక్కడేవున్నారు. ఎగ్జామినేషన్‌రూమ్ ముందు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని కూర్చొనున్నాడు పద్మనాభరావు. ఉండి వుండి వొక్కసారి బిట్టుగా నిట్టూరుస్తున్నాడు. ఎదురుగా శిలువమీద బలి అయిపోయిన ఏసుక్రీస్తు బొమ్మ వైపుకు నిర్నిమేషంగా చూస్తూ చలించిపోతున్నాడు.

ఎగ్జామినేషన్‌రూమ్ తలుపు తెరుచుకొంది. డాక్టరు బయటికి వచ్చింది. పద్మనాభరావు వొక్క అంగలో డాక్టర్ని చేరుకొన్నాడు. తన దీనతనంతా వొక్క చూపులో వ్యక్తంచేస్తూ డాక్టరు వైపుకు చూశాడు—డాక్టరు ఆయన కళ్లలోకి వొక్కసారి చూచింది. అతనేదో అడగబోయాడు. అంతలోనే ఆమె ముందుకు

'మేజర్ ఆపరేషన్ చెయ్యాలి. బ్లడ్ కావాలి—బ్లడ్ బ్యాంక్‌కి వెళ్ళి యిది చూపించి బ్లడ్‌బాటిల్ వొకటి పట్టండి.' అంటూ వో కాగితం ఆతనిచేతికియిచ్చింది.

బ్లడ్‌బాంక్‌లో డాక్టరు మైక్రోస్కోపు లెన్స్‌లోంచి చూస్తున్నాడు. అతని కంటికి ధనవంతులదీ—నిరుపేదలదీ, విజ్ఞానులదీ మూర్ఖులదీ—రిక్షావాడిదీ— కారు వోనరుదీ—అందరి రక్తం వొక్కటిగానే కనబడుతోంది. అతను సాంకేతికంగా నిర్ణ రచుకొన్న 'గ్రూపులు' తప్పితే అంతా వొకటే ప్రవాహం—ఒకే చైతన్యం.

పద్మనాభరావు ఆదుర్దాగా అతని ముందు కొచ్చాడు. అతను తలెత్తి చూశాడు.

'నమస్కారం' అని ఆ కాగితం అతని చేతిలోపెట్టి జేబులోంచి వందరూపాయల కాగితాలు బయటికి లాగి అతని చేతిలో పెడుతూ 'తొందరగా యియ్యండి డాక్టర్' అన్నాడు.

'ఉంచండి...వుంచండి' అంటూనే చెయి జాపాడు డాక్టర్. అది అందుకొని 'వుండండి' అని టేబుల్‌మీదవున్న రిజిస్టర్ తిరగవేసి ఫ్రిజిడైర్ దగ్గరకు వెళ్ళి తలుపు తెరచి చూచాడు. ఆందోళనగా తిరిగివచ్చాడు.

'వెరీసారీ...'ం' గ్రూపు బ్లడ్ లేదు... రాత్రి ఎమర్జన్సీకి వాడేశారు'—అన్నాడు.

పద్మనాభరావు కాళ్ళ క్రింద భూమి క్రుంగిపోయింది.

దిగ్భ్రాంతుడై పోయాడు. డాక్టరే అతనికి చైతన్యాన్ని కల్పిస్తూ 'నా దగ్గర రిజిష్టర్డ్ డోనార్స్ లిస్ట్ వుంది. అడ్రస్ యిస్తాను. మనిషిని పట్టండి వెంటనే తీసి యిస్తాను' అంటూ పుస్తకం వెతికి అతనికొక అడ్రసు వ్రాసి యిచ్చాడు.

ఆకాశం విషాదంగా కన్నీరు కారుస్తున్నట్టుగా వర్షం కురవసాగింది. ఉండీ వుడిగీ కురుస్తున్న ఆ వానలో పద్మనాభరావు కారొచ్చి ఆ మురికిపేట ముంగిట ఆగింది. లోపలికి చొచ్చుకు పోవాలని చూచిందికాని వీలు కాలేదు. గట్టిగా నిట్టూర్చి ఆగిపోయింది. కారులోంచి దిగాడు పద్మనాభరావు. ఆ మురికి వీధిగుండా వెడుతుంటే ఆతనికి నేలమీద నడుస్తున్నట్టుగా లేదు. పట్టుపంచె చెంగు ఎత్తిపట్టుకొని

నిదురుగా కదిపిడ్న వాళ్ళని 'బిక్షాలు యిల్లెక్కడ?' అని అడిగాడు—

వో కుర్రవాడు ఆయన్ని ముందుకు తీసుకు వెళ్ళాడు. వో గుడిసెముందు ఆగి 'ఇదే' అని చెప్పాడు.

'బిక్షాలూ' అని ఆదుర్దాగా పిలిచాడు.

చీకటిగా మృత్యువు దాక్కొన్న గుహలా వున్న ఆ గుడిసెలోంచి బయటికివస్తూ, 'ఎవరు బాబూ?' అన్నాడు, అలాంటి మనిషి తనకోసం రావటంచూసి ఆశ్చర్య పోతూ.

'ఎంత డబ్బయినా యిస్తాను...నీతో పనుంది...నువ్వోసారి హాస్పిటలుకు రావాలి'

'దేనికిబాబూ?'

'నా భార్య చాలా ఆపదలో వుంది... ఆపరేషన్ చెయ్యటానికి...రక్తం కావాలిట...డాక్టరు నిన్ను తీసుకురమ్మన్నాడు'అని అయాసపడుతూ చెప్పాడు.

'ఇప్పుడెట్టా బాబూ...మా ఆడదానికి వొళ్ళు బాగోలేదు...మూసేకమ్మా...తెరిచే కన్నుగా వుంది...నాలుగురోజుల్నుంచీ దానికి దారకం లేదు. రెండురోజులుగా నా గ్గంజి లేదు. మంచంకాడ లేకపోతే మరీ లో చెడిపోద్ది బాబూ...'అని అంటుంటే అతని కళ్ళవెంట నీళ్ళొచ్చాయి.

'నీకేం భయంలేదు......నువ్వొక్కసారి హాస్పటల్‌కిరా......పని అవగానే నీదగ్గరికే డాక్టర్ని పంపుతాను. కావలసినవన్నీ కొనిస్తాను. ఇదిగో కావాలంటే యీ డబ్బుంచుకో'అని వందరూపాయల కాగితం బయటికి లాగాడు.

'క్షణంసేపుకూడాఏవారనియ్యటం లేదు బాబూ...వొంటే గోడుగా ఏడుస్తోంది. మరెవరినన్నా పిల్చకెళ్ళండి'అంటూ లోపలికి పోబోయాడు.

పద్మనాభరావు గుండె జారిపోతుంది. ఆందోళన అధికమైంది.

'బిక్షాలు...యింకెవ్వరూ లేరు...... బాబ్బాబు...ప్రాణం కాపాడు...నీకెంతయినా యిస్తాను'అంటూ అతని చేతులు పుచ్చుకొన్నాడు. ఇంట్లోంచి 'ఏంటిమావా?' నీరసంగా అడిగింది బిక్షాలు పెళ్ళాం— లోపలికెళ్ళి అంతా ఆమెతో చెప్పాడు—

'ఎళ్ళిరా మావా...నూరుమేళ్ళు మంచం చేస్తే వొక్క మేలు మన్ని కాస్తదంటారు—'

ఆమె మాటలతో బిక్షాలుకి ధైర్యం వచ్చింది—

ఆమె పాలిపోయిన ముఖంలోకి, లోతుకి దించుకుపోయిన కళ్ళలోకి చూస్తుంటే అతనికళ్ళలో నీళ్ళుతిరిగాయి—

ఎదురుగావున్న ఏసు బొమ్మమైపు వొక్కసారి చూచి 'జేగె వొచ్చేస్తానే'... అంటూ ఆమె చేతిని నిమిరి బయటికొచ్చాడు — పద్మనాభరావు డోరుతీసి పట్టుకొని బిక్షాల్ని తన ప్రక్కన కూర్చో పెట్టుకొన్నాడు.

'ఆమెకి జబ్బేవిటి?' అని ఆప్యాయంగా అడిగాడు.

'ఏందో బాబూ నాలుగు రోజులనాడు ధర్మాసుపత్రికి పోతే ఎర్రనీళ్ళు పోసిన్ను ... నాల్రోజులుగా వొళ్ళెపాణం పోయే పాణం—'

'అయ్యో...పాపం' అన్నాడు పద్మనాభరావు—కొద్దిక్షణాల్లో బిక్షాలు బ్లెడ్ బ్యాంకులో మంచంమీద పడుకొని వున్నాడు. అతని శరీరంలోంచి బొట్లు బొట్లుగా రక్తం సీసాలోకి పడుతోంది. ఎదురుగా వున్న ఏసుక్రీస్తు బొమ్మకు దణ్ణం పెట్టుకొన్నాడు. చాలీ చాలని గంజ మెతుకులతో కూడ పెట్టుకొన్న రక్తపు చుక్కలవి. వాటిని పీల్చుకొంటుంటే దాని వొంకే చూస్తూ అలసటు పడిపోయి నట్టుగా వుండిపోయాడు. అలసటతో బలహీనంగా వున్న అతనికళ్ళు మూతలు పడ్డాయి ఏం జరిగిందో అతనికి తెలియదు. అతను మేలుకొనేప్పటికి వార్డ్‌బాయి రొట్టె పాలు — తెచ్చి ముందుంచాడు. వాటిని చూడగానే దారకం లేకుండావున్న భార్య జ్ఞాపకం వొచ్చింది. అవి ముట్టుకో బుద్ధికాలేదు. డాక్టరొచ్చి—

'తిను...లేకపోతే కళ్ళు తిరుగుతాయి... నరవకేస్తే' అన్నాడు పల్స్ చూస్తూ. అతను మెదలకొండా తిని పాలు త్రాగాడు. వార్డుబాయ్‌వచ్చి 'ఆయనేవన్నాయిచ్చాడా?' అని అడిగాడు—

'లేదు —

'యిప్పుడే పుచ్చుకోవాలి...తరువాత వాళ్ళు మన ముఖం చూడరు'అని వెళ్ళిపోయాడు—

బిక్షాలు తూలుకొంటూ నడుస్తూ డాక్టరు రూం ముందుకు వచ్చాడు.

# భగవానుని పాదాలు

గుమాస్తా— అతన్ని పిలిచి వోచరుమీద ఎనిమిదిరూపాయలకి సంతకం పెట్టించుకొని ఏడు రూపాయలు అతని చేతిలో పెట్టాడు.

'పిచ్చివాయాల...మనతో అవసరం వుండగానే గుంజుకోవాలి. అవసరం తీరితే పైసకూడా ఎవడూ యివ్వడు' బిక్షాలుకి అర్థంకాక అతని ముఖంలోకి చూచి— దణ్ణంపెట్టి వెళ్ళిపోయాడు.

ఒకప్పుడు వంశప్రతిష్ఠకు గర్వకారణమైన రక్తం, రక్తంవోడ్చి శ్రమించానని బాధపడే రక్తం, రుధిరధారలు పారించానని విర్రవీగే వీరరక్తం తరతరాలుగా నీతి, నిజాయితీలతో పునీతమైందని పలవరించే పవిత్రరక్తం కదనరంగంలో దేశరక్షణకై క్షతగాత్రులైన వీరసైనికుల ప్రాణాలు కాపాడటానికై అవసరమైన రక్తం, ప్రాణాపాయంనుంచి మనిషిని కాపాడటానికి—అమృతమై సాయపడే రక్తం—ప్రతిమనిషికి ప్రాణం తరువాత ప్రియమైనదానికి అతనికి వచ్చిన ప్రతిఫలం—అది. దానితో చావు బ్రతుకులమధ్య వంతెన కడదామని అతని ఆశ. 'ఈ నాలుగురూకలే నాలుగురోజులు. ముందొచ్చివుంటే' అనుకొంటూ రొట్టె, పళ్ళూ కొనుక్కొని—అంతులేని ఆరాటంతో యింటికి బయలుదేరాడు.

ఆపరేషన్ థియేటర్ముందు పచార్లు చేస్తున్న పద్మనాభరావు వొంట్లో రక్తం పోటెత్తుకు ప్రవహించసాగింది— మెదడు నరాలు బద్దలయ్యేట్టుగావున్నాయి. గుండె కొట్టుకోటం రోకటిపోటులా అనిపించసాగింది. ఎదురుగావున్న ఏసుప్రభువు బొమ్మకి ఎన్నోసార్లు దణ్ణం పెట్టుకొన్నాడు.

థియేటర్ తలుపు తెరుచుకొంది. డాక్టరు చేతులు ముడుచుకొంటూ బయటికివస్తూ, 'కంగ్రాచ్యులేషన్స్ ... మగబిడ్డ ... తల్లీ బిడ్డా కులాసాగా వున్నారు...'

ఒక్కసారిగా అతని హృదయం మీంచి బరువు దింపినట్టుగా అయింది. కొద్ది క్షణాలక్రిందట ఆవేదనతో ఘూర్ణిల్లిన అతని హృదయం ఆనందంతో గంతులు వేసింది.

బిక్షాలు రొప్పుకొంటూ తన గుడిసెలోకి ప్రవేశించాడు— మూలుగు వినిపించటం లేదు. మంచం దాటివున్న ఆమె పాదాలు చూశాడు. అసలే కట్టెలా వున్న ఆమెపాదాలు కొయ్యబారిపోయాయి. చేతితో తాకాడు చల్లగా వున్నాయి.

ఆమె ముఖంలోకి చూచాడు—

అరణ్యంలో అర్ధరాత్రి రాలిపోయిన పుష్పంలా వుంది. అతని కళ్ళల్లో నీళ్ళు యిగిరిపోయాయి. కాంతి విహీనమైన కళ్ళతో ఏసు ప్రభువు వొంక—'ఏమిటిది?' అని చూస్తున్నాడు.

పతితులు, దరిద్రులు, బాధా తప్తులు, క్షుధార్తులు ఎక్కడ వుంటారో—అక్కడే వుంటాయంటారు భగవానుని పాదాలు! అవి, అక్కడ లేవు...వున్నా అవి చల్లబడి కొయ్యబారిపోయాయి!

మనిషి మట్టయిపోయినా మనసు రాయి కాలేదు బిక్షాలుకి. విధి చేసిన గాయం యింకా పచ్చిగానే వుంది. బిక్షాలు దిక్కు తోచక తిరుగుతూ హాస్పిటల్వైపు వెళ్ళాడు. స్పెషల్ రూమ్సుముందునుంచి నడిచి వెడుతున్నాడు—వో రూంలో పద్మనాభరావు కుర్చీలో కూర్చొని ఏపిల్కాయ కోసి పెడుతున్నాడు—ఆమె పక్కలో పసిపాప వుంది—

ఆమె బుగ్గల్లోకి మళ్ళీ గులాబిరంగు వచ్చింది!

అతని ముఖంలో ఆనందం వుంది!—

ఎదురుగా ఏసుక్రీస్తు పటం వుంది—

దానిమీద వాడని మల్లెల మాల వుంది—

వారి చుట్టూ కాంతి, ఆరోగ్యం, ఆనందం వ్యాపించి వుంది. భగవానుని పాదపీఠంకూడా అక్కడే స్థాపితమై వుంది. దానిమీద వున్నాయి వారికి దాస్యం చేసే భగవానుని పాదాలు. ●

రోజూ ఆ అమ్మాయిని ఫాలో అవుతున్నావ్- కనీసం ఒక్క సారయినా నోరు మెదిపి నీతో మాటాడిందా---






ఆర్. యస్. వి. సుధాకర్

# నైట్ గౌన్

ఛాతి 24 అం + 4 అం.

రాత్రి పడుకోపోయే ముందు పిల్లలని శుభ్రంగా తడి బట్టలో తుడిచి పౌడరు అద్ది, వదులుగావుండే దుస్తులు వేసి పడుకోపెట్టాలి. ఈ గౌను కుట్టడం సులభం. ఒకటి ముక్కాలు మీటరు ప్రింటెడ్ లాన్ గాని, వాయిల్ గాని కొంటే చాలు. మెడ చుట్టూ, చేతుల చుట్టూ, గుండెలమీద కుట్టడానికి సన్నని లేసు తీసుకోవచ్చును.

ఈ బొమ్మలలో ఇచ్చినట్లు ముందు అసలు సైజుకి కాగితంతో నమూనా కత్తిరించుకోవాలి. తరువాతనే బట్ట కత్తిరించాలి. ఇకపై పని అతి సులువు. ముందు భాగాలు కుట్టి ముందువేపు బాడీ భాగానికి వెనుకవి వెనుకభాగానికి అతికి, తరువాత రెండూ కలిసి కుట్టేయాలి. మెడా, చేతులూ ముందే పైపింగువేసి కుట్టేస్తే అతకడం మరీ సులువు. గౌను వెడల్పు కొలిచి దానికి రెండింతలు మూడు అంగుళాల పేలిక తీసుకుని కుచ్చెళ్ళు కుట్టి కింద అతుకు వేయాలి.




పొడుగు 27 అం. + 3 అం.
మెడనుంచి భుజం దాకా 5½ అం.
భుజం వెడల్పు 3 అం.




బొమ్మ 1. ముందుభాగం. 2. వెనుక భాగం. 3. పూర్తి అయిన గౌను.

—ఎమ్. కామేశ్వరి





రెండురకాల జర్మన్ ఫాషన్‌లు। (యు. పి. యస్—దాద్)




అమ్మా! విశాలాంధ్రా! విల్లు వ్రాయవూ! ఇలా అడుగుతున్నందుకు నన్ను క్షమించమ్మా! నిష్ఠురంగా, చేదుగా, ఉంటుందని, నీకు కష్టం తోస్తుందని, నిజం దాచలేను — అందమైన అబద్ధం చెప్పలేను. అయినా నా పిచ్చి గాని, ఈపాటికి నువ్వు గ్రహించే ఉంటావీ కఠోర సత్యాన్ని — ఇంతకాలం కళ్లల్లో పెట్టుకొన్న నీ ప్రాణాలు అనంతంలోకి జారిపోబోతున్నాయని, కొన ఊపిరి అనంతవాయువుల్లో భాగం కాబోతున్నదని, విధ్వంసకాండ మంటలతో అట్టుడికిపోయి నీరసగించి పోయిన గుండె విశ్రాంతి తీసుకోబోతున్నదనీను — సమైక్యతావాద వైద్యులు, వేర్పాటు వాద రోగ క్రిములను జయించలేక పోతున్న విషయం గమనించే ఉంటావ్! 'సమర్థవంతమైన' నాయకత్వం, బహుళ ప్రచారం లభించిన వేర్పాటు రోగంముందు పదవులు నిలబెట్టుకోగలిగే యుక్తులు తప్ప, ధైర్యంగా ప్రజల మధ్యకు పోయి, ప్రజానాడి పరిశీలించి, రోగ నిదానం చేసి వైద్య విధానం నిర్ణయించుకోగల సామర్థ్యం లేకపోయిన సమైక్యతావాద వైద్యుల ధోరణిని చూస్తూనే ఉన్నావు కదా! బహుళ ప్రచారం, అర్థబలం, లభించిన 'అబద్ధం' ముందు నిజం వెల వెలబోతున్న విషయం తెలుసు కదా! కొన ఊపిరితో రోజులు లెక్కపెట్టుకొంటూన్న నిన్ను చూస్తూంటే నాకు గుండె తరుక్కుపోతోంది — ఒకప్పుడు సర్వతోభాయమానంగా ఉండే నువ్వు ఇప్పుడిలా జీవించాలనే ఇచ్ఛ నశించిన దీర్ఘకాల రోగిలా తయారవ్వటం చాల దురదృష్టకరం— అవునులే! ఏం చేస్తావులే! కడుపులో ప్రేగులు ఒకదానితో ఒకటి కొట్లాడుకొంటూంటే, కుడిచేయి, ఎడమచేతిని విరిచేయ ప్రయత్నిస్తూంటే, ఎడమకాలు, కుడికాలు తన్నుకొంటూంటే, కనురెప్పలే కళ్లకు అపకారం తలపెడ్తూంటే, నీకు జీవించాలనే కోరిక ఇంకేమి మిగుల్తుంది! —కాబట్టి నువ్వు మా గుండెల మీదుగా నడిచి కాలగర్భంలో కలిసిపోకముందే, విల్లు వ్రాయి 'విశాలాంధ్రా'—నన్నపార్థం చేసుకోకమ్మా — నీ తదనంతరం కూడా మేము రాబందుల్లా కొట్లాడుకొని నీ ఆత్మకు అంతులేని క్షోభ కలిగించకుండా ఉండాలనే నేనిలా అడుగుతున్నాను— ఐహిక సంబంధమైన ఆస్తులు, న్యాయంగానో, అన్యాయంగానో, సామరస్యంగానో, వైషమ్యంగానో, శాంతిపూర్వకంగానో లేక బలప్రయోగంద్వారానో ఎలాగోలాగు పంచుకొంటాములే — లేకపోతే 'ట్రిబ్యునల్సు' 'కమిషన్సు' కోర్టులు, కమిటీలు ఎలాగూ ఉంటాయిగా! ఈ మామూలు ఆస్తులు గురించి కాదు నేను నిన్ను విల్లు వ్రాయమని కోరుతున్నది—ఏ ట్రిబ్యునలూ మాకు పంపకాలు వేయలేని 'ఉమ్మడి సంపద' గురించే విల్లు వ్రాయమని అడుగుతున్నానమ్మా!

విల్లు వివరంగా వ్రాయాలి మరి! ముందుగా యాభైయారు పుష్పాల అక్షర మాలను, తరతరాల తెలుగు సాహిత్య సుగంధ సౌరభాన్ని 'ఆంధ్ర' 'తెలంగాణా'లు ఏ నిష్పత్తిలో పంచుకోవాలో నీ విల్లులో స్పష్టంగా నిర్దేశించు—తెలుగు వాఙ్మయం జీవనది వంటిది—అది తరతరాలుగా అనంతమైన ప్రవాహరూపంగా కాలమందు ప్రవహిస్తూ, రసజ్ఞుల హృదయ సీమల్లో ఆనందం పుష్కలంగా పండిస్తున్నట్టిది — దీనిని మమ్మేవిధంగా పంచుకోమంటావ్! కవిత్రయ విరచితము, పంచమవేదమనీ ప్రసిద్ధికెక్కిన 'ఆంధ్ర మహాభారతము'లోని పదునెనిమిది పర్వములు ఏ నిష్పత్తిలో పంచుకోమని నీ ఆజ్ఞ? ఆది కవి నన్నయ కవిత్వంలోని అక్షర రమ్యత, తిక్కన 'కవిత్వం'లోని, పాత్ర రసౌచిత్య పోషణ, భావ స్ఫూర్తి, ఎఱ్ఱన కవిత్వంలోని ప్రౌఢ శైలి, పరిపక్వత, మేమేవిధంగా వాటాలు వేసుకోవాలో వివరంగా వ్రాయాలి సుమా విల్లులో! అదే చేత్తో బమ్మెర పోతనా

మాత్యుని 'శ్రీమదాంధ్ర మహాభాగవతం'లోని భక్తిరసం, శ్రీనాథుని శృంగార నైషధంలోని విశిష్టమైన శైలి, ప్రౌఢత్వము, తెనుగుసేత, తాళ్ళపాకవారి గ్రంథాల్లోని భక్తి సాంప్రదాయం కూడా వాటాలు వేసేయ్. 'స్వర్ణయుగం'లో పుట్టుకొచ్చిన ప్రబంధాల్ని న్యాయంగా పంచాలి మరి! ఆంధ్ర భోజుని 'ఆముక్తమాల్యద'లోని నారికేళపాకం, పెద్దనగారు సంపాదించిన గండపెండేరం, ముక్కు తిమ్మన వలకబోసిన శృంగారం, పింగళి సూరన భాషాపాటవం. 'వికటకవి' హాస్య చతురత, మొదలైనవన్నీ ఇన్నాళ్ళుగా తెలుగువాడి ఉమ్మడి సంపదగానే నిలిచిపోయాయి—ఇప్పుడెలాగా లాగు పంపకాలు వేయాలి మరి! అన్నట్టు, వేములవాడ భీమకవి, భట్టుమూర్తి, మొల్ల, యయాతి చరిత్ర వ్రాసిన తెలగన్న ఎవరెవరికి చెందాలో కూడా విల్లులో నిర్దుష్టంగా వ్రాయాలి—మరి, త్యాగరాజ—భక్తి సంగీతం ఎవరికి చెందాలి? మేమెలాగూ ఆదరించలేము గాబట్టి తమిళ సోదరుడికే వదిలేయమంటావా పోనీ?

శతావధానాలు చేసిన తిరుపతి వెంకటకవుల సామర్థ్యం, చిన్నయసూరి వ్యాకరణం, వీరేశలింగం పంతులుగారి సంస్కరణాభిలాష, గురజాడవారి సరళకవిత, రాయప్రోలువారి లాలిత్యం, యెంకిపాటల నండూరివారి జాణతనం 'మహాప్రపంచం' శ్రీశ్రీ లోని ఉప్పెనలాంటి ఆవేశోద్వేగాలు, సర్వసమతావాంఛ, అభ్యుదయత్వం, ఆరుద్రలోని పనితనం. 'నా తెలంగాణ కోటి రత్నాలవీణ' అంటూనే 'మహాంధ్ర సౌభాగ్యగీతి' నాలాపించిన దాశరథిలోని నైర్మల్యం, సి. నారాయణ రెడ్డి బహుముఖ ప్రజ్ఞాపాటవం మమ్మల్నే నిష్పత్తిలో పంచుకోమంటావ్! మొత్తానికి ప్రాచీనాంధ్రసాహిత్యం యొక్క ఉన్నతినీ, ఆధునిక సాహిత్యంలోని 'చైతన్యాన్ని' ఎలా వాటాలు వేస్తావో ఏమో! అంతా నీయిష్టం—అన్నట్టు, గిరీశం, యెంకి నాయుడుబావ, పార్వతీశం (బారిష్టర్) ఎవరికి చెందాలో కూడా నిర్ణయించు.

తీరిగ్గా చరిత్రపుటలు తిరగవేస్తే తెలుగువాడు గర్వపడే అవసరం బాగా కలుగుతుంది!— చరిత్ర 'తెలుగువాడి'కి ఆపాదించే గొప్పతనాన్ని 'ఆంధ్ర' 'తెలంగాణా'ల మధ్య జాగ్రత్తగా, న్యాయంగా పంచాలి సుమా! రాజమహేంద్రవరం పాలించిన రాజరాజు యొక్క కవితాశక్తి, గోనగన్నారెడ్డి కవితాభిలాష, విజయనగర సామ్రాజ్య వైభవం, రెడ్డిరాజుల శౌర్యప్రతాపాలు, ఓరుగల్లు సామ్రాజ్యాధిశుల సాహసం, రాణిరుద్రమ గొప్పతనం, నాగమ్మ రాజకీయ చతురత, రామదాసు యొక్క పరిణతి చెందిన భక్తి, రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యాన్ని గడగడలాడించిన అల్లూరి సీతారామరాజు దేశభక్తి, ఇలాంటివన్నీ మేమే నిష్పత్తిలో పంచుకోవాలో నిర్ణయించు—

క్రిష్ణా, గోదావరి నదుల సంగతి మర్చిపోకు— తరతరాలుగా 'తెలుగు వాడి' సౌభాగ్యానికి కారణభూతులుగా నున్న ఈ నదీమతల్లుల ఆదరాభిమానాల్ని ఏ విధంగా పంపకాలు వేయాలన్నది, నీకు గడ్డు సమస్యే కావచ్చు—'దేశభాషలందు తెలుగు లెస్స' అన్న శ్రీకృష్ణదేవరాయల మెచ్చుకోలు, 'తెలుగూ ఈజ్ ది ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అన్న హాల్డేన్ దొరగారి సర్టిఫికేటు, ఏ ప్రాంతపు భాషకు చెందాలో నువ్వే నిర్ణయించాలి సుమా. ఆవకాయ ప్రియత్వం, గోంగూరంటే మమకారం తెలుగువాడి రక్తంలో జీర్ణించుకు పోయున్న గుణాలు— '(గోంగూరా గో బ్యాక్' అని అరుస్తూ వీధిలో బస్సుల మీద రాళ్ళ వర్షం కురిపించే 'పోరగాళ్ళు' కూడా చాలా మంది ఇంటో గోంగూర పచ్చడంటే లొట్టలు వేస్తారు!!) వీటితోపాటు 'ఆరంభ శూరత్వం', పొరుగింటి పుల్లకూరే రుచిగా ఉందనే మనస్తత్వం, స్వంత సమస్యల మీదకన్న, పరుల సమస్యల పట్ల ఎక్కువ ఆసక్తి కనపరిచే గుణం, ఉమ్మడి ఆస్తిగానే ఉంచుకోమంటావా?

నాకు తెలుసు — ఇలా ఈ ఆస్తి పంపకాలు చేయవలసి రావటం నీ గుండెల్ని పిండిచేస్తుందని — కాని ఏం చేస్తాం-తప్పదనిపిస్తోంది—ఈ ప్రమాదం తప్పి నువ్వు గండం గడిచి బయటపడితే నాకన్న ఎక్కువ సంతోషించే వాడుండడు. కాని...కాని... ఇప్పుడున్న పరిస్థితుల్ని గమనిస్తూంటే 'వేర్పాటు రోగం' నిన్ను త్వరలో పొట్టనపెట్టుకోనున్నదనే నగ్న సత్యం నా మనోవీథిలో వికృత నృత్యం చేస్తోంది — అందుకే అడుగుతున్నాను —ఏమిటీ 'తెలుగోడు' అని విసుక్కోకు! అపార్థం చేసుకోకు! విశాలాంధ్రా! విల్లు వ్రాయి విశాలాంధ్రా!



గొలుసునవల

# అపరాజిత

నలుగురు రచయిత్రుల సంయుక్త రచన

నాలుగవ భాగం

## నాయని కృష్ణకుమారి

### జరిగిన కథ

అద్దెకుంటున్న మధు మాధవిని ప్రేమించాడు. మాధవిని రాజారావు పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడని తెలుసుకుని మధు కృంగిపోయాడు. రాధకి మధుకి గల సంబంధాన్ని తెలుసుకుని మాధవి ఆశ్చర్యచకితురాలవుతుంది. రాధ రాసిన ఉత్తరంలో ఆమె మనస్తత్వం పూర్తిగా అర్థమైపోయింది. రాధ గర్భవతి తల్లి కాబోతున్నానన్న భయం ఆమెకి లేదు. ఉద్యోగాన్వేషణలో హైదరాబాదు చేరుకున్నది. టీచరుగా ఉద్యోగం సంపాదించుకున్నది. మాధవి రాజారావుని కలుసుకోవడం తటస్థించింది.

## 18

ఆ వేళ సాయంత్రం కూడా సరిగ్గా ఏడాది కిందట మాధవీ రాజారావూ పార్కులో కలుసుకున్న సాయంత్రంలాగే వాన జల్లుగా కురుస్తోంది. చిత చితలాడే ఆ నాడు వర్షంలోనే వాళ్లిద్దరూ పార్కులోకి చేరుకున్నారు. వెళ్లేటప్పుడు, 'నేనూ బావా, అలా పార్కుకేసి వెళుతున్నాం పెద్దమ్మా' అని కేకేసి బయలుదేరింది మాధవి. చిటపట వర్షం కురుస్తున్నవేళ ఈ విహారమేమిటో అర్థంకాక అలాగే చూస్తూ ఉండిపోయింది పరమేశ్వరి.

మంచుదువ్వలా, నుసినుసిలా రాలుతున్న, నీటి తుంపరుల్ని లెక్కచెయ్యకుండా ఇద్దరూ మాలతీలత కిందుగా అమర్చిన బెంచీమీదికి చేరుకున్నారు. మాధవి మనస్సు అన్యాసక్తంగా ఉంది. సరిగ్గా సంవత్సరం కిందట ఇలా బావతో పార్కుకి వెళ్లి జోరున కురిసే వర్షంలో ఇంటికి తిరిగి వచ్చాకనే మధు తనమీద కోపగించుకొని వెళ్లిపోయాడు. అప్పటి నుండి యింతవరకూ మళ్లీ ఆ దుర్బల ప్రేమికుణ్ణి చూడనే లేదు తను. ఈ మధ్యలో ఎన్నెన్ని జరిగాయి! తమ జీవితాలు ఎన్ని చిక్కుముడుల్లో బిగుసుకుపోయి గిలగిల్లాడుతూ ఎక్కడివక్కడే ఆగిపోయాయి! ఇక మధును చూచే అర్హత తనకెక్కడుంది? ఆ కృతఘ్నుణ్ణి చూడను, చూడనని పదేపదే అనుకుంటూ నిరాసక్తంగా, ఎట్టఎదుట బహు నాజూకుగా జారుతున్న చినుకుదారాలను చూడసాగింది మాధవి.

'మాధవీ! మధును గురించే ఆలోచిస్తున్నావనుకుంటాను. అలా అంత దీనంగా ప్రకృతిలో లీనమైపోతున్నట్లు చూడకు మరి! నీవు మనుషుల్లోకి దిగిరావాలి. నీవూ ఒక ఇంటి దానవై పిల్లాపాపతో సుఖంగా ఉండగా చూడాలని నీబావ హృదయం ఆరాటపడుతోంది. మధు ఎక్కడున్నా వెతికి తీసుకువచ్చే బాధ్యత నేను వహిస్తాను. సరా!' అన్నాడు రాజారావు.

'నిష్ఫలం బావా! మధుకూ మాధవికీ ఇకమీద ఎటువంటి సంబంధమూ ఉండబోదని నీకు స్పష్టంగా చెప్తున్నాను.'

'ఏమీ! అతకడానికి వీలులేనంతగా భగ్నమైపోయిందా మీ ప్రేమ?'

'ప్రేమ! — ఆ పదానికి ఈ క్షణం వరకూ సరైన అర్థాన్ని ఇచ్చుకోలేకపోతున్నాను. మధును నిజంగా నేను ప్రేమించానా? అతనిపట్ల నాకున్న భావానికే ప్రేమ అని పేరా? అయితే ఒకప్పుడు అతన్నీ, అతనిమీద పెంచుకున్న ప్రేమనీ పూర్తిగా విస్మరించి నీ దగ్గరికి వచ్చేయాలని ఎందుకనుకున్నాను? అది ఇతరుల దృష్టిలో మానసికంగా వ్యభిచరించినట్లే కదా! ఆ క్షణాన నువ్వే నన్ను స్వీకరించి ఉంటే నిన్ను అన్యాయంచేసే చపలత్వం నాలో ఉండేదా? ఇవన్నీ జవాబులులేని ప్రశ్నలు'

ఈ మాటలతో రాజారావు బాగా కదిలిపోయాడు. జీవితంలో తాను ఎప్పుడూ వినే అవకాశంలేని మాటల్ని, వింటున్న అనుభూతి అతన్ని నిలవనీయలేదు.

'ఎంతపని జరిగిపోయింది మాధవీ! నిండు మనస్సుతోనే నువ్వు నా ఆశ్రయం కోరావా! నేనే యింటి ముంగిట నిలచిన స్వర్గసుఖాన్ని కాలదన్నుకుని నిర్భాగ్యుణ్ణై రోదిస్తున్నానా? ఆ సంగతి నేనిప్పుడే గ్రహిస్తున్నాను. నాకు మరొక అవకాశం ఇవ్వు మాధవీ! ఒక అవకాశం! నిన్ను కళ్లల్లో పెట్టుకుని కాపాడుకుంటాను. నీ ఉనికివల్ల నూరేళ్ల నా జీవితాన్నీ ఆనందపు పంటగా మలుస్తాను. నీవు 'ఊ' అను'— అంటూ ఉద్రేకంగా మాధవి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకోబోయాడు.

మాధవి చప్పున తన చేతుల్ని లాక్కుంది. 'నీకు జ్ఞాపకముందా బావా! వెనక మనం పార్కుకు వచ్చినప్పుడు

ఇలాగే నా చేతుల్ని పట్టుకుని 'విదిలించి వెయ్యకు మాధవీ ! ఇలాగే ఉండనీ!' అని అర్థించావు. ఆవేళ నీ చేతుల్లో నా చేతుల్ని ఉంచడానికి కొంత సంకోచం ఉన్నా, విముఖంగా లేను. కాని కొన్నాళ్ల తర్వాత నిజంగానే నా చేతుల్ని నీ చేతుల్లో ఉంచడానికి నా మనస్సు స్థిరంగా నిర్ణయించుకున్నప్పుడు విదిలించబడ్డది నేనే బావా ! అది నేను జీవితంలో మర్చిపోలేను. మళ్లీ ఈ చేతుల్ని నీ చేతుల్లో ఉంచలేను.'

రాజారావు తనువు సన్నగా ఒణుకుతోంది. లోపల కదలాడే భావసంఘర్షణని సంయమనం చేసుకోలేక సతమతమౌతున్నట్లు అతని ముఖరేఖలు సూచిస్తున్నయ్. స్వరం బాగా వ్యగ్రమైంది.

'నామీద కోపమా మాధవీ ! నిజంగా నేను మూర్ఖుణ్ని'అని మాత్రమే అనగలిగాడు.

'కాదు బావా! ఉత్తముడివి— నీ స్వార్థాన్ని అవతలకునెట్టి ఎదుటివాళ్ళ దృష్టిలో పరిస్థితుల్ని బేరీజు వెయ్యగల వివేకవంతుడివి. అప్పుడే నువ్వు నన్ను స్వీకరించడానికి ఒప్పుకునిఉంటే ఈనాడు నీమీద నా మనస్సులో పెరిగిన ఈ అంతులేని గౌరవానికి ఆధారం ఉండేది కాదు. నువ్వూ నేనూ అతిసామాన్యంగా అందరు దంపతులూ గడిపేటట్లు సంసారం గడిపి ఉండేవాళ్లమేమోకానీ, నాకీ గౌరవమూ, నీకీ ఆరాధనా, తీరని కోరికయొక్క రాపిడీ మిగిలేవి కావు.'

రాజారావుకు తెలుసు. కథ తిరిగితిరిగి మళ్లీ మొదటికి వస్తుంది. తమ రెండు జీవితాలూ ఒకేప్రవాహంలో సమాంతరంగా కొట్టుకుపోతున్న రెండు శుష్క కొండాలు. అవి రసభరితాలై ఎప్పుడూ స్పందించవు. ఎప్పుడూ కలుసుకోవు. అంతులేని విరక్తితో అతని హృదయం రోదించింది.

'నాకు తెలుసు బావా! ఈ క్షణాన నా పట్ల జాలితో నీ గుండె నిండిపోయింది. కాని నేనేం చెయ్యగలను? సంపూర్ణహృదయంతో నన్ను నేను, నీకు అర్పించుకోగలనా? ఈ హృదయంలో ఒకప్పుడు సుస్థిరంగా నిలిచిపోయిన మధుఛాయలు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయాయని చెప్పగలనా ? అతనిస్మృతి అనేది



నా అణువణువునా రక్తంలో కలిసి జీర్ణించుకుని పోయింది. అది తుడిచి వేయడం అసాధ్యం బావా!— నీవు నన్ను నిరాకరించి ఈ సత్యాన్ని గుర్తించేటట్లు చేశావు. అందు కెంతయినా నీకు కృతజ్ఞురాలిని.'

'మరి, కావాలని అతణ్ణి ఎందుకు దూరం చేసుకుంటున్నావు మాధవీ? ఇద్దరూ అభిమానాలకు పోతే ఇటువంటి సమస్యలు పరిష్కారం కావు'.

అసలుకథ వినడానికేకదా నిన్నిక్కడికి రమ్మన్నాను. అంతా విని నీ తీర్పు చెప్పు. నేనూ, రాధా, మధూ ముగ్గురమూ పాత్రలమైన ఈ త్రిభుజాకార కథనంలో ఏవో రెండు పాత్రలకే విడరాని బంధం ఉండడానికి వీలుంది. అందులో చివరకు దూరంగా నిలిచిపోయేది నేనే. అందుకు కారణం రాధ మధు ప్రతిరూపాన్ని తన గర్భంలో పెంచుతూండడం.'

'మాధవీ' ఏమిటి నువ్వనేది?—' సిద్ధంగా అరవలేదన్నమాటే కాని ఆశ్చర్యాన్నీ, బాధనూ, మేళవించిన స్వరం నాగుబాము బుసలా రాజారావు గొంతు నుండి బయటకు వచ్చింది. మాధవి జరిగిన కథంతా చెప్పింది.

'నువ్వు మా సంగతి పట్టించుకోక

# అపరాజిత

తటస్థంగా ఉండిపోయిన ఈ సంవత్సరం వ్యవధిలో ఇంత జరిగింది బావా! ఇంత వరకూ ఈ సంగతి నీకు తెలియనీయనందుకు నన్ను క్షమించు. నీకే కాదు పెద్దమ్మకూ, పెదనాన్నకూ ఎవ్వరికీ తెలియదు. ప్రస్తుతం రాధ పండంటి పిల్లవాణ్ణి కని ఆస్పత్రిలో ఉంది.'

'ఎలా జరిగింది మాధవీ? రాధ ఎలా ఈ వలయంలో చిక్కుకుంది? ఒక ఆడపిల్లకన్యాయంచేసి పిరికివాడిలా పారిపోయాడా మధు?'

'రాధ అమాయకురాలు కాదు బావా! పైపెచ్చు స్వార్థపరురాలు. తాను కోరుకున్నదేదో, దాన్ని పొందడంలో సంఘాన్ని ఇతర మానవత్వపు మమతల్ని నిర్దాక్షిణ్యంగా త్రోసిపుచ్చిన కార్యసాధకురాలు. నేను ప్రేమించినట్లే అదికూడా మధునే ప్రేమించింది. వాంఛిత వస్తువును చేజిక్కించుకునే పరుగు పందెంలో అది గమ్యానికి దగ్గరవుతూ వచ్చింది. నేను మొదటి అడుగులోనే అడ్డంకుల్ని అధిగమించలేక అలసి కూలబడి పోయాను. ఇప్పుడు చెప్పు బావా! నా మార్గం ఏమిటో? నాకూ మధుకూ ఉండవలసిన సంబంధం ఏమిటి?'—మాధవి ఆవేశాన్ని అతి ప్రయత్నంమీద అణచుకుంటూ చెప్పుతోంది. రాజారావు మాధవి నాస్థితిలో చూడగానే ఒక్కసత్యం స్పష్టంగా గోచరించింది. ఈవిడ మధును హృదయ పూర్వకంగా ప్రేమిస్తోంది. పైకెన్ని కబుర్లు చెప్పినా, ఆవిడ అంతరంగంలో వెలిగే మధుయొక్కస్మృతి ఎన్నటికీ ఆరిపోనిది. అది ఆవిడ జీవిత సుఖాన్నీ, శాంతినీ, ఆవిడ సర్వస్వాన్నీ తైలంగా ఉపయోగించుకుని అఖండంగా అలా మండుతూనే ఉంటుంది. ఆ ఎరుక వల్ల రాజారావు హృదయం మాధవిపట్ల ఆర్ద్రమై పోయింది.

'నీకు భగవంతుడే ఏదో ఒక దారి చూపించాలి — ఇంత జరిగాక మధు ప్రవర్తన ఎలా ఉందో తెలుసుకోడానికి ప్రయత్నించ లేదా? అతగాడు రాధను స్వీకరిస్తాడా? నిన్ను మర్చిపోగలిగాడా మాధవీ?—'

'నాకేం తెలియదు బావా! ఆమాట కొస్తే రాధకూ తెలియదేమో! కాని ఒకటి మాత్రం నిస్సందేహంగా చెప్పగలను. సహనం లేనివాడూ, వెంటనే నిర్ణయం తీసుకోలేని చపలచిత్తుడూ అవునేమో కాని, ఆత్మద్రోహి కాలేదు. ఒక స్త్రీని వంచించి మరో స్త్రీని వివాహమాడేంత అల్ప సంస్కారి కాదు. ఏనాటికైనా రాధను భార్యగా స్వీకరించకపోతే అతని మనస్సుకు శాంతి ఉండదు. నిర్విప్తంగానైనా అటవీ లోకంలో బ్రతకడానికి రాధ అతని భార్య కాక తప్పదు. హైదరాబాదులో అది మధు భార్యగానే వ్యవహరింపబడుతోంది. తెలియని దూరాలకు వెళ్ళిపోయిన మధు రాకను నిరీక్షిస్తూ బ్రతుకుతోంది. ఇంచుమించు ప్రతి రెండ రోజులకూ రాధ నాకో ఉత్తరం వ్రాస్తుంటుంది'—

రాజారావు మరేమీ మాట్లాడలేదు జరుగుతున్న ఈ కథ చాలా చిత్రంగా ఉంది. ఇందులో తను, మాధవి, రాధ, మధు, అందరూ విధుర ప్రేమికులే అందరూ ఈ విశ్వనాటక రంగంలో వియోగ శృంగారానికి ఆలంబనాలై తమ తమ విషాదభరిత పాత్రల్ని పోషిస్తున్నారు. కథ ఎలా ముగుస్తుందో, తెర ఎప్పుడ

ఎవండోయ్ కార్టూనిస్టుగారూ! ఈవారం పత్రికలో
మీ కార్టూనొకటి జూశా! హబ్బ! భలే నవ్వొచ్చిందండి!
ఇహ్హిహ్హి! కానీ మరీ అంత అసందర్భంగా గీశారేవిటండీ?



పడుతుందో, ఊహాకందని విధంగా ఉంది—

ఇంతవరకూ తానొక్కడే భగ్నప్రేమికు డనుకున్న అభిప్రాయం చెదిరిపోయింది. ఇక్కడ ఎవరు ఎవర్ని ఓదార్చాలి? ఎవరికి ఎవరు చేయూతనిచ్చి లేవనెత్తాలి? అటు వంటి పరిస్థితుల్నిదాటి విషాదోన్ముఖంగా సాగిపోతున్న జీవితాలు తమవి. ఈ బ్రతుకులు ఎవరికివారే బ్రతకాలసినవి. ఒక తోడూ, ఒకనీడా అనే భాగ్యానికి నోచుకో నటువంటివి—

'లే, మాధవీ! ఇప్పటికే బాగా చీకటి పడిపోయింది. ఇన్నాళ్ళూ నీ జీవితాన్నైనా చక్కదిద్దగలనేమో అన్న ఆశతో బ్రతుకుతుండేవాడిని. ఇప్పుడిక నాకదీ తీరిపోయింది. పోదాం పద!' అన్నాడు రాజారావు.

మాధవి, ఆ గొంతులో ధ్వనించిన విషాదానికి భయపడి పోయింది. అతని వాలకం చూచి, దిగులుపడ్డది. మరో మాటా పలుకూ లేకుండా అడుగులో అడుగు వేసుకుంటూ అతన్ని అనుస రించింది. ఇంటికి చేరేసరికి శివశాస్త్రి పరిస్థితి ఏమీ బాగా లేదు.

*

మధు మరో వారంరోజులు నరహరి దగ్గరే ఉన్నాడు. అతనిలో ఉన్న జడ త్వాన్ని పోగొట్టడానికి విచారం మాయం చెయ్యడానికి నరహరి ఎన్నివిధాలుగానో పాటుపడ్డాడు. ఒకరిని ప్రేమించి మరొక రిని వివాహం చేసుకుని సుఖంగా బ్రతుకు తున్న మనుషుల్ని ఎత్తి చూపుతూ, తనకు తెలిసిన గాథల నెన్నిటినో విసుగు లేకుండా చెప్పాడు. ఇంచుమించు ప్రతి సాయం త్రం నరహరి మిత్ర హృదయాన్ని మరల్చాలని చేసే ప్రయత్నం ముందు మధు కేవలం తటస్థంగా మిగిలిపోయే వాడు.

'మధూ! ఇవ్వాళ మీ నాన్నగారి దగ్గ ర్నుండి ఉత్తరం వచ్చింది,' అంటూ జేబులోనుండి కవరొకటి తీసిచ్చాడు ఆవేళ కాలేజీనుండి వస్తూనే నరహరి.

'నే నిక్కడున్నట్లు నువ్వు రాశావా?' ఆశ్చర్యంగా, జాబు అందుకుంటూ అడి గాడు మధు.

'అవును—ఒరే, మనల్ని కన్నందుకు తల్లినీ తండ్రినీ సుఖపెట్టడం మన విధి. అది లేకపోగా అంతులేని దుఃఖాల పాలు చెయ్యడం క్షమించరాని నేరం. ఒక్కగా నొక్కబిడ్డవు. నీవు పరారీ అయి పోతే ముసలి మనస్సుల క్షోభ ఎలా ఉంటుందో కొంచెమైనా ఆలోచించుకో కుండా ఇలా ఉంటివి. నీవు ఇక్కడికి వచ్చినరోజే నాన్నగారికి వ్రాసేశాను. ముందా ఉత్తరం చదువుకో!'

ఉత్తరం నరహరికి వ్రాసిందే, 'మధు మాకు ఒక్కగా నొక్కబిడ్డ నాయనా! మేం కుదిర్చిన సంబంధం ఇష్టంలేక ఇల్లు వదిలిపెట్టి వెళ్ళిపోయాడు. అతని అంతర్యం మాకు చెప్పిఉంటే ఈ పెళ్ళికి ప్రయత్నాలు చెయ్యకనే పోదుము. వాడు ఎవర్ని కట్టుకున్నా ఎక్కడ తిరిగినా సుఖంగా ఉండడమే మాకు కావలసింది. పెద్దతనంలో మాకు కడుపుకోత తెచ్చి మమ్మల్ని శిక్షించవద్దని నీ మిత్రుడికి చెప్పానుకుంటాను. వాడికి మా ఆశీస్సులు.—'

తండ్రికి తనమీద చాలా కోపం వచ్చింది. నిష్ఠూరంగా ఉన్న ఆ ఉత్తరం మధు అంతర్గత చైతన్యాన్ని కదిలించి తలి దండ్రుల విచారవదనాల్ని కళ్ళముందు

డాక్టర్ కబుర్లు

## మనస్సు - దేహం

'అతని బాధంతా మనస్సు లోనే ఉంది! వేరే శారీరక రోగ మేమీ లేదు!!'' అని ఎవరో ఎవరి గురించయినా అంటూ ఉంటే మీరు వినే ఉండవచ్చు.

ఒక వ్యక్తి దేహంలో లోపం ఏదీ లేకపోయినా మానసిక వ్యథవల్ల దేహం వత్తిడికి లోనయి కొన్ని నొప్పులు లేక ఇతర వ్యథలు రావచ్చు. కొందరికి కడుపులో నొప్పి, మరికొందరికి గుండెల్లో పోటు, మరికొందరికి దడ......

అంటే ఇటువంటి వ్యక్తికి ఏ చిక్కూ లేదని అర్థమా? కాదు. ఎందుచేతనంటే, మానసిక వ్యథలు దైహిక వ్యథల కన్నా తీవ్రమయినవి కావచ్చు. అంతేకాక, ప్రతిచిన్న అస్వస్థతా చివరికి జలుబుకూడా—మనస్సు మీద ప్రభావం కలిగి ఉంటుంది. రోగాలలో మనస్సునీ, దేహాన్నీ కలిపి చికిత్స చెయ్యాలి. వేరుగా ఉంచటానికి వీలు లేదు.

ఒక వ్యక్తికి ఏదయినా నొప్పి వచ్చి అది కాన్సర్ అని భయం వేస్తే డాక్టరు పరీక్ష చెయ్యాలి పరీక్ష మూలంగా కాన్సర్ లేదని తెలిస్తే వ్యక్తి నొప్పి వెంటనే పోవచ్చు!



అంటే డాక్టరు మానసిక, దైహిక బాధలని రెండింటినీ పోగొట్టాడన్న మాట!

మానసిక బాధలు కాల్పనిక బాధలు మాత్రం కావు. అవి యదార్థాలు. వాటికి చికిత్స ఎంతయినా అవసరం.....

(కాపీరయిటు)

విరిసింది. తన బ్రతుకుకు పరమార్థ మేమిటో తనకే తెలియడంలేదు. ప్రేమించిన పిల్లను దూరంచేసుకున్నాడు. ఆలోచితంగా తొందరపడి మరో పిల్లతో తన జీవితానికి ముడి రచించుకున్నాడు. కన్నతల్లికీ తండ్రికీ దుఃఖాన్ని మిగిల్చి ఇలా పారిపోయి వచ్చేశాడు. ఏమి సాధిద్దామని వచ్చినట్లు? జరుగుతున్న చరిత్రకుభయపడి వచ్చేశాడా? తను పారిపోయినంతమాత్రాన ఎక్కడిదక్కడ ఆగిపోతుందనుకున్నాడా? ఉత్త ఉష్ట్రపక్షి తెలివి తనది. ఛ, ఇలా కాదు బ్రతకవలసింది. ఈ జీవితానికో గమ్యం ఉండాలి. చేసిన తప్పులు మన స్ఫూర్తిగా దిద్దుకునే నేర్పు అలవడాలి. నిండుగా మనిషిలా గుండె ధైర్యంతో ముందుకు సాగడం నేర్చుకోవాలి. కల లోంచి అప్పుడే లేచిన వాడికి మల్లేమధు,

'నరహరీ! రేపే ప్రయాణం కడుతున్నాను. ఇన్నాళ్ళనుండీ నువ్వు చేసిన బోధల సారాంశం వంటపట్టినట్లే ఉంది' అన్నాడు.

ఆ మాటలకు నరహరి మనస్సులో ఆనందమంతా ఒక్కసారిగా కళ్ళల్లో వెలిగింది

'ముందు ఇంటికి వెళ్ళు. అమ్మకూ నాన్నకూ కనపడి ఆ మీద నీ కార్యక్రమాన్ని నిర్ణయించుకో. ఇంతకీ నీ ఉద్యోగం నీకోసం ఇంకా ఉంటుందా? మళ్ళీ ప్రయత్నాలు మొదలెత్తుకోవలసిందేనా?' —

'ఒద్దుపొమ్మని కాలదన్నిన వాళ్ళకోసం ఉద్యోగాలు పడిగాపులు కాసే కాలమా



యిది? ఏదీ దొరక్కపోతే మా ఊళ్ళో సొంత సేద్యం ఉండనే ఉంది. నాన్నగారికి ఆసరా అవుతానన్న తృప్తన్నా మిగులుతుంది నాకు.'

'ఎంత పితృభక్తుడివిరా' పల్లెటూర్ని అంటిపెట్టుకుని సేద్యం చేసుకోడానికింకా చాలాకాలం ముందుందిగాని, నాదో సలహా విను! నీకు మన శర్మ జ్ఞాపకం ఉన్నాడా?'

'ఏ శర్మ?'

'నా క్లాస్‌మేట్ సుందరశర్మ. నీకు జ్ఞాపకంలేదూ, ఎప్పుడూ నాకూడా తిరిగేవాడు!'

'అవును నరహరీ! వాడు బ్రిలియంట్‌గా ఉండే ఆడపిల్లలంటే కుళ్ళుకుంటుండేవాడు కదూ! ఓసారి ఎవర్నో ఏడిపించబోయి ప్రిన్స్‌పాల్‌చేత వార్నింగిప్పించుకున్నాడు!'

'వాడే! ఆ హాబీ ఇప్పటికీ పోలేదులే. అది మరో అవతార మెత్తింది. వాడి పత్రికలో ఆడవాళ్ళను ఎగతాళి చేస్తూ అసూయ కుమ్మరించే ఆర్టికల్సన్నీ ఆడ పేర్లూ మగపేర్లూ రకరకాలుగా పెట్టుకుంటూ వాడే రాసుకుంటుంటాడు. పత్రిక సర్క్యులేషన్ పెరగడానికి అది గూడా ఒక కారణం. ఇంతకూ వాడు నడిపే పత్రికే తెలుగుజ్యోతి, నువ్వు చూసే ఉంటావు — ఈ మధ్య నేను హైదరాబాదు పనిమీద వెళ్తే మాటల్లో మరో సబ్‌ఎడిటర్ని కూడా వేసుకోవాల్సి

వచ్చేట్టుందన్నాడు. పోనీ నువ్వెళ్ళరాదూ?

'నాకిస్తాడంటావా?'

'ఎందు కివ్వడూ? తెలుగు సాహిత్యమంతా ఆ చివర్నుంచి ఈ చివరదాకా ఔపోసన పట్టినవాడివి, నీకంటే అర్హుడు వాడికిమాత్రం దొరకద్దూ! అయినా నేనూ ఉత్తరం వ్రాస్తాను — వెళ్ళి చూడు!'

సరే నన్నాడు మధు.

కొంతసేపు మిత్రులిద్దరూ మాటా పలుకూ లేకుండా ఆగిపోయారు. ఇంతలో అపర్ణ కాఫీ తెచ్చియిచ్చింది. ఇద్దరి మనసుల్లోనూ ఎన్నెన్నో మాట్లాడుకోవాలన్న కాంక్ష ఉంది. కాని ఎలామొదలుపెట్టాలో తెలీక ఇద్దరూ కాస్త సేపు మథనపడిపోయారు. చివరకు మధే అన్నాడు:—

'ఇక నన్నడగాల్సింది ఏమీ కనిపించలేదా నరహరీ నీకు?'

'ఎందుకు లేదూ! అసలు నువ్వు చెప్పవలసిందంతా అట్లానే ఉండిపోయింది. ప్రపంచంలో ఎటువంటి క్లిష్టసమస్యలకైనా ఓపిగ్గా వెతికితే ఓ పరిష్కార మార్గం దొరికి తీరుతుంది. ఇకముందు నీ జీవితాన్ని నడపదలుచుకున్న మార్గమేమిటో తెలిస్తే నేను సంతోషిస్తాను. ఇంతవరకూ ఓ నిర్ణయానికి రాకపోతే తొందరేమీ లేదు వచ్చాకే ఓ ఉత్తరం వ్రాసి తెలియబర్చు.'

'కొత్తగా ఇప్పుడు తీసుకుంటున్న నిర్ణయమంటూ ఏమీలేదు. నేను ప్రేమించిన మాధవి నా కందుతుందన్న ఆశ ఎటూ లేదు. ఈపాటికి ఆవిడ తన అక్క భర్తకు మరో భార్యగా, అక్కబిడ్డకు మరో తల్లిగా స్థిరపడడం జరిగినా జరిగి ఉండవచ్చు. ఆ ఉదారురాలికోసం నా జీవితాన్ని నాశనంచేసుకుని మజ్నూలా మారిపోవడం అవసరమా! అటువంటి అవసరం ఏమీ లేదని నీ జీవితం నాకు గుణపాఠం నేర్పుతోంది. అపర్ణ నిన్నెంతగా సుఖపెడుతోందీ నేను చూస్తున్నాను. గతాన్ని మర్చిపోయి ఆవిడనే మనస్సునంతా నింపుకుని నీవెంత హాయిగా బ్రతుకుతున్నదీ గమనిస్తున్నాను. అదీకాక నేను రాధను ఒదులుకోవడానికి ఏమాత్రమూ వీలులేదు నరహరీ! ఆ అమ్మాయిపట్ల నా ప్రవర్తన కొండంత



బాధ్యతను నామీద మోపుతోంది.'

'ఒకవేళ మాధవిని నువ్వు సరిగా అర్థం చేసుకోలేదేమో ఆవిడా నీకోసమే ఎదురు చూస్తూంటే ఏం నిశ్చయించుకుంటావు?'

నిశ్చయాలకుగానీ, నిర్ణయాలకుగానీ, నాకో అవకాశమంటూ మిగిలింది గనకనా! నేను చేసిన పొరపాటువల్ల, రాధ తప్ప మరెవరైనా నా భార్య కావడం జరిగితే నాకు మనశ్శాంతి ఉండదు. రాధే నన్ను నిరసించి తన మార్గాన్ని తను నిర్ణయించుకుంటే అది వేరేమాట! అదీగాక ఇక్కడ నీకో విషయం స్పష్టంగా తెలియాలి. విశాలంగా దిక్కులకు పరుచుకున్న చెట్టు, ఎండనంతా తాను భరిస్తూ తన్ను చేరిన వారికి చల్లని ఆశ్రయాన్నిచ్చి స్వేద తీరుస్తుంది. సరిగ్గా మాధవి అలాంటిదే. ఒకరికి సుఖాన్నందించే ప్రయత్నంలో తాను పడుతున్న కష్టాన్ని నవ్వుతూ భరించగల ఓపిక ఆవిడసొత్తు. తన ఆశ్రయం కిందికి వచ్చిన వ్యక్తులు ఎవరై ఉండాలనే జిజ్ఞాసకంటే, ఎంతగా తను వాళ్లను సుఖపెడుతున్నాననే అంచనాయే ఆవిడకు తృప్తి కలిగిస్తుంది. ఇంతవరకూ అటువంటి ఆశ్రయాన్ని పొంది అలస పెరగకుండా జీవితాంతమూ గడపగలిగే అదృష్టం నాకేలేదు—రాధ విషయం అలా కాదు. ఉత్త ఉద్రేకపు ముద్ద. మనస్ఫూర్తిగా ఒక వ్యక్తిని ప్రేమించగల గాఢశీలత ఉంది. అతనికి ఆత్మార్పణ చేసుకోగల ఉదారతా ఉంది. కాని ఆ వ్యక్తికి లొంగి అతనిమీదే ఆధారపడే బలహీనత లేదు. ఇంత జరిగింతర్వాతకూడా రాధ, నేనూ లేకుండా, నా చేయూత అవసరం లేకుండానే తాననుకున్న విధంగా జీవితాన్ని మలుచుకోగలదు. ఈ సంధి కాలంలో జాగృత మవుతున్న అద్భుత శక్తికో ప్రతీక రాధ! తరతరాలుగా అధికారం నెరపడం మాత్రమే అలవాటు చేసుకున్న ఏ పురుషుడూ, రాధలో తాను కోరుకున్న భార్యను పొంది తృప్తిగా బ్రతకలేడు. విధి చిత్రంగా నా జీవితాన్ని అటువంటి స్త్రీ జీవితంతో ముడి వేసింది. మనస్ఫూర్తిగా ఆ విధివిలాసాన్ని శిరసా వహిస్తాను. నా అదృష్టం ఎలా ఉంటుందో వేచి చూడవలసిందే' అన్నాడు మధు. నరహరి ఆ మాటలు విని, 'నీ నిర్ణయానికి నిన్ను ప్రశంసిస్తున్నాను మధూ! నీ జీవితం సుఖప్రదంగా సాగాలని కోరుకుంటున్నాను'—అని, 'అపర్ణా' అని కేకవేశాడు.

అపర్ణ గాజులు గలగల లాడించుకుంటూ, ముఖాన్ని చిరునవ్వుతో వెలిగించుకుంటూ వచ్చింది.

'వింటున్నావా? మీ మరిది నిర్ణయం?' అన్నాడు నరహరి.

'మీరు కట్టించిన ఈ రెండంగణాల మహాభవనంలో, గోడ ఇవతల మీరు మాట్లాడుకుంటుంటే, అవతల వద్దనుకున్నా వినక తప్పుతుందా? అన్నీ వింటూనే ఉన్నాను'—అన్నది.

'మరికనేం? హారతిపళ్లెం పట్టు! మరిది పెళ్లికొడుకై మారాలని కోరుకో' అంటూ గలగలా నవ్వాడు నరహరి.

(ఇంకా ఉంది)

కూరలూ గుణాలూ:

# దొండకాయ

కన్ని చౌకగా లభ్యమయే కూరలలో యిదొకటి. చలువ చేస్తుంది. కఫాన్ని అణచివేస్తుంది. పైత్యం, రక్తస్రావం, వాతం, అపానవాతం, క్రిమిరోగం గలవారికిది మేలు చేస్తుంది.

పండినదయితే కాస, శ్వాస, వమనం వాత పైత్యాలు, రక్తపైత్యం, కామిల ఈ రోగాల్ని అణచివెయ్యడానికి తోడ్పడుతుంది. కానిశ్లేష్మాన్ని, గురుత్వాన్ని కలుగజేస్తుంది. అంత సులభంగా జీర్ణం కాదు.

దొండాకురసరం—పైత్యం, ఉబ్బు, పాండువు, క్షయ మూలవ్యాధి వీనిని తగ్గించడానికి కాటువేయడం వల్ల పుట్టిన పుండుపై దొండాకు నూరి ఆ ముద్దను పూసి కట్టుకట్టిన ఆ పుండు వేగంగా తగ్గుతుంది.

దొండకాయయొక్క దుర్గుణాలకు విరుగుళ్లు:— 1. అగాకరకాయ 2. దోసకాయ 3. చెట్టుమునగకాయ 4. గరమసాలా లేదా ఉష్ణౌషధములు.

తియ్య దొండకాయ:—

ఈకూర కళ్లకు చలవ చేస్తుంది. వాతం, పైత్యం, వికారం, చర్మి వీనిని అణచడానికి దోహదం చేస్తుంది. అగ్నిదీప్తి నిస్తుంది. శరీరానికి కాంతి నిస్తుంది. వీర్యవృద్ధి గావిస్తుంది. మేహం, పాండువు, కామిల, నేత్ర రోగములు కలవారికివి పథ్యమయినవి.

అమితంగా తింటే బుద్ధిమాంద్యం కలుగజేస్తుంది. దీని దుర్గుణాలకు విరుగుళ్లు:—1. నేతిలో వేయించడం 2. బెల్లము, 3. బెల్లం, పులుసు పెట్టి వండడం.

నేతి దొండకాయ :—

ఈకూర చలవచేస్తుంది. పైత్యశాంతి, మేహశాంతి చేకూరుస్తుంది. పథ్యమయిన కూరలలో యిదొకటి!

అడవిదొండకాయ :—

వాతశ్లేష్మం, గళ రోగం, నేత్ర రోగం గలవారికిది మేలు చేస్తుంది. పైత్యం, మలబద్ధం, అగ్ని మాంద్యం కలుగజేస్తుంది.

దీనికి విరుగుళ్లు: — 1. నెయ్యి 2. పులుసు 3. నువ్వుపొట్టు కార్చి చేసిన క్షారము.

సేకరణ:—అకుండి నారాయణమూర్తి

# వారఫలం

## 3-7-1970 శుక్రవారం మొదలు
## 9-7-1970 గురువారం వరకు

**మేషం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరుతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**వృషభం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభించ గలదు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. బంధువులకు సహాయం చేస్తారు.

**మిథునం:** మీ చాకచక్యమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించ గలదు. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. అధిక వ్యయం జరుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభించ గలదు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను తిరిగి అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కన్య:** అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. వారం ఆఖరులో మీరు ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

**తుల:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించ గలరు.

**వృశ్చికం:** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమ పడినా ప్రయోజనం ఉండదు. అధిక వ్యయం జరుగుతుంది. వారం మధ్యలో సంతోషకరమైన వార్తలను వింటారు. వృత్తి వ్యాపారాలు బాగా ఉంటాయి. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్టుగా నెరవేరుతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం:** వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం ఆఖరులో నమ్మిన వారివల్ల శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాల్లో ప్రయాస కలుగుతుంది.

**కుంభం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. దైవకార్యాలు నెరవేరుతాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు.

**మీనం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందక పోవడం వలన ఇబ్బంది కలుగుతుంది.

స్త్రీలకు:— పుణ్యకార్యాలు చేస్తారు. అలంకార వస్తువులు కొంటారు.

—మహేష్

# ప్రశ్నావళి

## ....కె. రామలక్ష్మి....

**జి. ఎస్. ఆర్. శ్రీకాకుళం**

రామలక్ష్మిగారూ కొందరు అసలు ప్రశ్నలకు సమాధానం యివ్వకుండా ఇతరత్రా వాటికి ఇస్తూ ఉంటారు. అలాంటి వారి నేమనాలండీ?

ప్రశ్నావళి రామలక్ష్మి అనండి.

అన్నట్లు మీ సాహిత్య నందనవన విహారాలు పూర్తిగా కావాలి తెల్పకలరా?

ఈ ప్రశ్న ఇప్పటికో పదిసార్లు అడిగి ఉంటారు—మీరడిగేదేమిటో నాకర్థం కావడంలేదు సార్! క్షమించాలి.

**వి. ఎస్. ఎల్. చోడవరం**

అక్కయ్యా నీకు చెల్లెళ్లు తమ్ముళ్లు ఉన్నారా?

లేరమ్మా లేకుండే నాముద్దు కాస్త కొంపలో వాళ్లు పంచుకునేవారు! నేనుడుక్కు చచ్చేదాన్ని.

**ఎస్. ఎస్. ఆర్. పాలూరు**

రచయిత్రి బీనాదేవిగారు రా. వి. శాస్త్రి గారికి బంధువులా?

ఆ ఇద్దరిదీ ఒకటే కులం— సాహితీకులం!

**ఎస్. కె. పొట్లై (పాలకొండ)**

స్త్రీకి జీవితంలో కావలసిందేమిటి?

అర్థం చేసుకునే భర్త, మెదడుకిమేత, మనస్సుకి విశ్రాంతి.

**జి. వి. జి. తిరుపతి**

పెళ్లిళ్లు స్వర్గంలో నిశ్చయం అవుతాయి అంటారే, మరి నరకంలో?

ముహూర్తందాకా స్వర్గంలోనే నిశ్చయం అవుతాయి. రిసెప్షను దగ్గిరనుంచే మీరు చెప్పిన రెండో చోట!

**ఆర్. పి. జగిత్యాల**

మా స్నేహబృందంలో కొందరు గొప్పలు చెప్తుంటారు. వాళ్ల నేమనాలి?

సాధారణ మనుషుల్లా ప్రవర్తిస్తున్నారనాలి.

**పి. వి. ఐ. ముచగపాక**

స్త్రీకి తను బాధపడ్డం తప్పించి ఇతరులను బాధించడం ఆమెకు తెలియదంటాను. మీరేమంటారు.

అయ్యో! అయ్యో! ఇదేం మనిషి? అంటాను.

**మాధవీలత, కామారెడ్డి**

'మనం నిత్యవిద్యార్థులం' అన్నారు. కాని మానవుని జీవితం శాశ్వతం కాదుగా మరి?

నీటిబుడగలాంటి యీ జీవితాన్ని శాశ్వతం అనుకునే కదా మానవుడు ఇన్ని ఏర్పాటు చేసుకుంటాడు? అలాగే ఉన్నంత కాలమే— శాశ్వతం కాదా?!

**విజయరామ్, శ్రీకూర్మం**

'వీరమాతా' 'వీరపత్ని' వీరిలో ఎవరు గొప్ప?

ఇద్దరికిద్దరూ!

**రమణ, మద్రాసు**

కమర్షియల్ రైటరైన మీకు దిగంబర కవుల వంటి విప్లవ కవులను వ్యాఖ్యానించే నైతికార్హత లేదంటాను. మీరేమంటారు?

నా వృత్తే రచన. దింగబరులు వృత్తి వేరు. సాహిత్యం వేరు. . ... ఇక నైతికార్హతంటారా? హవ్వా? ఈ రోజుల్లో ఎవరికుందా అర్హత?!

**వి. మ. ల. బరంపురం**

...వాళ్లింట్లో మీ ఫోటో చూశాను. మీరు స్నేహితులని చెప్పారు. మరువలేని వ్యక్తులలో రామలక్ష్మి ఒకతె అని చెప్పారు. — మీరంత చెప్పక్కర్లేదు— చూడామణి తెలుసా అంటే వో అంటాను. ఆ రోజుల్లో మా 'గాంగ్'. చిన్నది— సన్నిహితమైనది. అడిగానని చెప్పండి.... పెంకిపిల్లా అయినా కాలేజీ పుస్తకంలోకి కార్డెల వచ్చిందని ఏకుళ్లుమోతు లెక్చరర్ నిలవేస్తే?!

**పి. జె. ఆర్. కాకినాడ**

ప్రజలు సినిమాలు చూడాలా? ఎందుకు?

ఆం చూడాలి. నిర్మాతల కోసం!

**కె. ఎల్. ఎన్. ఆర్. విశాఖపట్నం**

శ్రీ శ్రీ పై మీ అభిప్రాయం ఏమిటో?

అరవంలో చెప్పాలంటే 'చో'లా చెప్పాలంటే కవిగ్నర్‌గా ఇరుమల్లై అరసియల్ వాదిగా వరంగి మల్లై!!' అనాలి.

**సి. హెచ్. జి. ఆర్. భవానీపాట్నా**

కష్టాల్లో ఏడుస్తే కష్టాలు తీరవని తెలిస్తే ఎందుకు ఏడుస్తారు!

మనస్సు తేలిక పడుతుంది కనీసం— అని ఏడుస్తారు.

అక్కయ్యా మేం మీ యింటికి వస్తే ఆదరిస్తారా?

అది [illegible] ధర్మంకదా?

**డి. ఎస్. బందరు**

ఈ కాలంలో స్త్రీలకు విద్య ముఖ్యమా? వంట ముఖ్యమా? పెండ్లి ముఖ్యమా?

తగినంత చదువు, తరువాత పెండ్లి— పెండ్లి కోసం వంటా— మూడూ కావాలి.

**ఎస్. వి. ఆర్. ఆర్. కొల్లాపూరు**

సాంఘిక నవలల్లో శృంగారాన్ని అతిగా రాస్తున్నారు దీనిపై మీ అభిప్రాయం?

రాయ నివ్వండి సార్, పెరుగుట విరుగుట కొరకే అన్నారు కదా పెద్దలు?. . . .

**పి. ఎల్. శ్రీకాకుళం**

అన్యదేశం అంటె అర్థం ఏమిటి?

పిలి అంటే మార్జాలం అన్నట్టు— పరదేశం అంటే తెలుస్తుందా?

**జి. ఎస్. ఆర్. కొత్తగూడెం**

శ్రీమతి ఆరుద్రగారూ, పాపం, పుణ్యం మంచి చెడు, నీతి నిజాయితీ, ధర్మం అధర్మం మొదలగు మాటల సుస్థానం లేని ఈ ప్రపంచంకన్నా మరో ప్రపంచం మంచిదంటారా?

అక్కడ వీటికి బదులు ఏముంటాయో ఎలా తెలుస్తుంది బ్రదర్! అందుకే తెలియని దేవునికన్నా, తెలిసిన దెయ్యం ఒక్కొక్కప్పుడు ప్రిఫరబుల్!

**కె. జె. ఆర్. పిఠాపురం**

అభిమానులని ఫాన్సు అంటారేమిటండీ రామలక్ష్మిగారూ,

అవసరం అయినప్పుడు వాడి, అక్కర లేనప్పుడు పక్కకు పారేసేవికదా విసినికర్రలు! అలాంటివారే అభిమానులని కబోలు ఫాన్సు! అన్నారు!!

**బి. వి. బి. పిఠాపురం**

మానవునిలోని అసంతృప్తి ఆతని నైతిక పతనానికి దోహదం చేస్తుందా? అభివృద్ధికి దోహదం చేస్తుందా?

అసంతృప్తి మేధావులని విజ్ఞాన సముపార్జన వైపు పయనింప చేసింది, జిజ్ఞాసువులను తపస్సుకేసి పయనింప చేసింది. నిస్సంగులని సన్యాసం స్వీకరింప చేసింది. అలాగే— అసంతృప్తి ఆబకేసి అసంతృప్తి అత్యాశకేసి మనుషులను పయనింప చేయకపోలేదు.... అంచేత మనిషిని పట్టి ఉంటుంది అసంతృప్తి ఫలితం— అనాలి.

**ఎన్. ఎ. ఆర్. వెలో**

రామలక్ష్మిగారూ ప్రతిస్త్రీకి తనపేరు చివర భర్తపేరు పెట్టుకోవడం ఫాషనయి పోయింది కదా మరి మీ రెందుకలా పెట్టుకోలేదు?

చిత్తం దీన్నిపటే నా నేనెంత వోల్డు ఫాషను మనిషినో గ్రహించలే ?!



చిక్కని చీకటి గుడిసెపై కప్పునించి అలికిన యిల్లంతా అలముకుంది. బయట ఆకాశంమీద చంద్రుడు లేడు. నక్షత్రాల్లేవు. చీకట్లో ఏముందో తెలీడంలేదు. గాలిమాత్రం కూలీపైన విరుచుకు పడే కామందులా వేగంగా వీస్తోంది.

గుడిసెలోంచి ఉండుండీ మూలుగువినిపిస్తోంది. ఆ గుడిసెలో ఉండే మగమనిషి తను తాళికట్టిన స్త్రీని పదినిమిషాల్కితం చావబాది వెళిపోయినసంగతి ఎవరికీ అవసరమైన విషయంకాదు. అయిదేళ్ల పసివాడు—ఆకలితో పడున్నవాడు—ఆ మనుషులిద్దరికీ పుట్టినవాడు మాత్రం ఆ దృశ్యంచూచి తల్లడిల్లి పోయాడు తాళలేక పోయాడు. తండ్రిని అడ్డుకోబోయి తల్లితోబాటు,

తనూ చెంపదెబ్బలు తిన్నాడు. ఆతగాడు తాగిన మైకంలో వాళ్ళిద్దరినీ వాయించేసి, ఆ తలేదో ముంచుకు పోతున్నట్టు చిరిగిన పంచెను పైకి దోపుకుని చీకట్లో కలిసిపోయాడు. కన్నకడుపు గనుక, పసివాడి ఒళ్ళు తట్లు తేలిందని తల్లడిల్లిపోయి, కొడుకును ఒళ్ళోకి తీసుకుని ఆమె కుమిలిపోయింది. పసివాడు పాపం! వెక్కి వెక్కి ఏడ్చి నిద్రలోకి జారుకున్నాడు. గోనె సంచీమీద చిరిగిన ముతక చీరొకటి పరిచి, వాడిని పండుకోబెట్టి, ఆ చీరనే వాడి ఒంటిని కప్పి, పక్కనే కూలబడిపోయింది. చెదిరిన జుత్తు ముఖంమీద పడి, కన్నీళ్ళతో తడిసి బుగ్గలకంటుకుంది. భుజం మీంచి చీరకొంగు జారి నేలకంటుకుంది. తాగుబోతు భార్యగా సాగిన గతకాలం మెదడు అరల్లో గిరగిరాలు తిరుగుతూ ఆమె దురదృష్టాన్ని పదే పదే జ్ఞాపకం చేస్తూండగా, ఆమె మరేం చెయ్యడానికి మనసురాక బాధతో మరీ మరీ ఏడిచి తనూ కొడుకు పక్కను చోటు చేసుకుంది.

గుడిసెలో చీకటుంది. ఆమె మనసులో చీకటుంది. భవిష్యత్తంతా ఆమెకు చీకటిగనే ఉంది.

కుర్రవాడు ఉండుండీ మూలుగుతున్నాడు. వాడు మూలిగినప్పుడల్లా ఆమె నిద్రలో ఉలికులికిపడుతోంది.

గాలి బయట వేగంగా వీచి వీచి, ఒక్కపెట్టున కుండపోతగా వర్షం ప్రారంభమైంది. తాటాకులు సరి లేని గుడిసెపైన కుంభవృష్టి రాళ్ళవానగా ఉంది.

ఆకాశంలో మెరుపులున్నాయి. ఉరుములున్నాయి. ఎక్కడెక్కడో పిడుగొక్కటి విరుచుకు పడింది. చెట్టే కూలిందో—చేమేరలిందో—చిన్నవాడు దడుసుకుని గావురుమన్నాడు పక్కలో తల్లి భయపడి లేచి కూచుంది తడబడుతూ కుర్రవాడిని గుండెల కదుముకుంది. ఓపికలేని స్వరంతో ఓదారుస్తోంది. వీపుమీద చేయిరాస్తూ సముదాయిస్తోంది. పసివాడు మళ్ళీ పక్కమీదికి చేరాడు. కన్నతల్లి కౌగిట్లో కన్ను మూశాడు. బయట వర్షం ఏక జడిగా ఉంది.

పిల్లవాడి తల్లికి కన్ను మూతపడలేదు ఒళ్ళంతా దెబ్బలతో పచ్చిపులుసెంది. కొత్తకాదుగాని; కోరి చేసుకున్నవాడు ఎందుకూ కొరగానివాడై సర్వవేళలా ఎరుపెక్కిన కళ్ళతో ఎరిగిన వాళ్ళందరిలో తలవంపులుతెస్తూ తిరుగుతూండడమేగాక ఇప్పుడిప్పుడు దొంగతనాలకు చేతిని మప్పుతున్నాడని ఆమెకు తగని బాధగా ఉంది. జరిగిన గొడవంతా అందికే జరిగింది.

'నువ్వేం పనిపాటలు సేయొద్దు. అబ్బిగడిని పెట్టుకుని కూకో! నాను పని సేసుకొత్తా. ఆయిగా ఉందాం' అంది ఆదిలక్ష్మి.

అప్పటికే స్వర్గానికి అల్లంత దూరంలోఉన్న మల్లన్న ఊఁ అనలేదు. ఆఁ అనలేదు.

'దొంగతనాలు మానెయ్యి. పనుంటే పరవాణ్ణం తిందాం. లేనిరోజుల్లో వరిగెంజి తాగుదాం. దొరికితే కిళ్ళిరిసి జైల్లో తోసేత్తారు. నీకోసం ఏడుత్తా కూకోలేను.'

మల్లన్నకి మండుకొచ్చింది.

'ఏంటే కూత్తన్నావ్' అని అరిచాడు.

'మొగుడొచ్చాడని కూడెట్టడం లేదుగాని ఏంటే తెగ సతుకుతున్నావ్' అంటూ లేచాడు.

'దొంగతనాని కెల్తాను. రంగసాని దగ్గరికెల్తాను. నాయిట్టవే! నువ్వెవత్తెవే నాకు సెప్పడానికి. దొంగలంజా!' అంటూ జుట్టు పట్టుకున్నాడు.

పట్టుకోవడమేవిటి—పదునుగా పడడమేవిటి! అడ్డొచ్చినవాడు అబ్బిగాడంటూ చూడకుండానే అదే దరువు వేశాడు.

ఆదిలక్ష్మికి మల్లన్నంటే ఎప్పుడూ కోపంలేదు. మనువాడినవాడు తిట్టనీ మొట్టనీ—మనసిచ్చి, మమత నిలుపుకుని, బొందెలో ప్రాణం వున్నంతకాలం మాట కెదురు చెప్పకుండా ఉండాలన్నదే ఆదిలక్ష్మి నియమం. కాని, కట్టుకున్నవాడు కానిపనికి తలపెట్టేతే మనసు సరిపెట్టుకోలేకపోయింది. అంత మంచివాడు, అధర్మమంటే మండిపడేవాడు, తల నరికినా కల్లమాట పలకనివాడు దరిద్రంతో ఎలా మారిపోయాడని ఆదిలక్ష్మి ఆశ్చర్యపోయింది అక్కడెక్కడో ఆయినవారింటిలో అర్ధరాత్రివేళ అంకినదంతా చిక్కించుకుని చీకట్లో జారుకునేవేళ పట్టుబడిపోయిన పతాభిగాడికి రెండేళ్ళు జైలు శిక్ష పడిందని పల్లమ్మ చెప్పినప్పుడు ఆదిలక్ష్మి తనవాడికోసం తగని భయం పెట్టుకుంది. ఆ భయంతోనే నియమం తప్పి ఎదురుమాట చెప్పింది. రాత్రంతా కొంచెం హెచ్చుతగ్గుగా వానపడుతూనే ఉంది. ఆషాఢంలో అది అబ్బురం కాదు. ఆకులు అంతంతమాత్రంగా ఉన్న గుడిసెలోంచి వానదేవుడు మనసుపడి వట్టిల్లంతా నరసాపురంరేవు చేయడంకూడా ఆశ్చర్యంకాదు. నిద్రలో ములిగిన చిన్నవాడూ, చెంతనే చింతలో ములిగిన ముద్దరాలూ కొంచెం మెరకగా ఉన్న మూలను చేరుకుని చలికి వణుకుతూ ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎరుపెక్కిన కళ్ళతో ఎదురుచూస్తూ ఆ రాత్రి గడిపారు

ఎదురు చూడకపోయినా తెల్లవారక తప్పదు. ఉదయానికి పసివాడికి మాగన్నుగా నిద్రపట్టింది. ఆదిలక్ష్మి ఆవలిస్తూ లేచి తడక తీసుకుని ఈవల కొచ్చింది. సన్నటి చినుకులు పరదాగా రాల్తున్నాయి. వాకిట్లో పాతిన వంగమొక్కలన్నీ పీకలోతు నీళ్ళల్లో ములిగి ఉన్నాయి. నిద్రగన్నేరుకొమ్మలు కొన్ని గాలికి ఎగిరొచ్చి వాకిలంతా కమ్ముకున్నాయి. పక్కనున్న సన్నకాలవలో నీరు ఎర్రగా పరుగెడుతోంది. గుడిసె గుమ్మంలో మునగాళ్ళమీద కూచుని రాత్రి కురిసిన వర్షం ముద్రల్ని చూస్తోంది ఆదిలక్ష్మి. ఎప్పుడు లేచి వొచ్చాడో కుర్రవాడొచ్చి మెదలకుండా కూచున్నాడు.

'దేవుడా! నాబతుకు ఇలా సేసావెందుకు?' అనుకుంది ఆదిలక్ష్మి. రాత్రి జరిగిందందా జ్ఞాపకం వొచ్చి పదేపదే అదేమాట అనుకుంది.

'నానేం తప్పు సెయ్యలేదు. మరి నా బతుకెందుకిలా కాలిపోయింది. దేవుడా! ఆడిబుద్ధి సరిసెయ్యలేవా!?' అని కూడా అనుకుంది.

తనలో తను అనుకుంటున్నట్టు 'దేవుడా! ఆడిబుద్ధి సరిసెయ్యలేవా!' అని పైకే అనేసింది.

మెదలకుండా కూచున్న పిల్లవాడు ఆమాట విన్నాడు. వాడికంతా అర్థమై

# దేవుడు

పోయింది. రాత్రి జరిగింది వాడికి జ్ఞాపకం వొచ్చింది. బయట పరుగెడుతున్న వానసీట్లోకి చూశాడు. దిగాలుగా కూచున్న అమ్మనిచూసి, అడగదలచుకున్న ప్రశ్నని మనసులో అట్టడుగున పడవేశాడు.

అప్పటికి ఆదిలక్ష్మి వాడిని చూసింది.

'అబ్బిగా! లెగిసావురా! మాబాబే!' అంటూ వాడిని ముద్దు పెట్టుకుంది.

'నువ్వు మీ బాబులాగా తాగొద్దు. దొంగతనాలు సేయొద్దు. దొరబాబులాగా బతకాలిరా! బాగా సదుంకోవాలి. సంవచ్ఛరానికి రెండు కళాసులు సదుంకోవాలి. కలకటేరు వవ్వాలిరా నువ్వు—కలకటేరు వవ్వాలి.' అంది ఆదిలక్ష్మి గుండెల్లో కొడుకుమీద గూడు కట్టుకున్న ఆశవంతా విప్పి చెప్పతూ.

అబ్బిగాడదేం వినలేదు. వాడు మళ్లీ అమ్మ ముఖంలోకి చూసి, ఏదో అడగబోయాడు.

'సందకాడ కూడెడదావంటే నిద్దరోయావు. ఉప్పుడు తింటావా?' అని అడిగింది ఆదిలక్ష్మి.

తను నిద్రపోయానని అమ్మ అబద్ధమెందుకు ఆడుతోందో అబ్బిగాడికి అర్థం కాలేదు.

'ఆకలేత్తందే!' అన్నాడు.

ఆదిలక్ష్మి వాడిముఖం కడిగి మూకిట్లో యింత అన్నం పడేసి, అంత గంజిపోసి, నంజుకోడానికో ఉల్లిపాయ ముక్కిచ్చి కొడుకును తినబెట్టింది. తను ముఖం కడుక్కుందిగాని ముద్ద తినబుద్ధి కాలేదు.

'ఆడొస్తే యిద్దరం కూకొని తినొచ్చులే' అనుకుంది.

మెత్తగాఉన్న అన్నంతిని, గంజితాగి, చేయి కడుక్కుని, ఉల్లితేనుపులు తేన్చి, అబ్బిగాడు అమ్మపక్కని కూచున్నాడు. ఆమె ముఖంలోకి చూసి ఏదో అడగాలనుకున్నాడు గాని అమ్మ చెబుతుందో చెప్పదో అన్న అనుమానంతో మళ్లీ తల దించేసుకున్నాడు.

ఆదిలక్ష్మికి దేవుడిమీద కొండంత నమ్మకం. అన్నవరం దేవుడిని చూడాలని ఆమె కెప్పటినుంచో కోరిక. పెళ్లైన కొత్తలో మల్లన్న మనసు మత్తుగా ఉన్నప్పుడల్లా అడిగి అడిగి ఆదిలక్ష్మి విసిగెత్తిపోయి ఇంక అడగడం మానుకుంది. అందికే ఆమెకోరిక కోరికగానే ఉండిపోయింది.

'నాదేవుడు సరిగా సూత్తే అంతే సాలు! అన్నవరవేఁ ఎల్లాలని ఎక్కడుంది?' అనుకుని సరిపెట్టుకుంది.

ఏదో గొప్ప ప్రమాదం తనవాడికి ముంచుకొస్తుందని అనుమానం తగిలినప్పటినించి ఆమె మాటి మాటికి దేవుడిని తలుచుకుని, తన బతుకెందుకిలా చేశావనుకుంటూ ఉండడం ఆదిలక్ష్మికి అలవాటై పోయింది.

ఈసారి కుర్రవాడు తన ప్రశ్ననిక దాచుకోలేక పోయాడు.

'అమ్మా! దేవుడెక్కడుంటాడే?' అని అడిగేశాడు.

ఆదిలక్ష్మి అబ్బిగాడి కళ్లల్లోకి చూసింది.

'అమ్మా! సెప్పే! దేవుడెక్కడుంటాడే' అని అడిగాడు.

'ఎక్కడుంటాడని చెప్పాలి! 'కలడు కలండనెడు వాడు కలడో లేడో' అని వేదాంతశాస్త్ర మథనం సల్పిన మహామహులకే అనుమానం కలిగించినవాడు ఫలానాచోట పతితులకోసం, ఆర్తులకోసం అభయహస్తంతో కొలువు తీరి ఉన్నాడని అసలు ఆ ఆలైనా చదవని ఆదిలక్ష్మి ఎలా చెప్ప గలుగుతుంది!

పసివాడి ప్రశ్నకి సమాధానం చెప్పలేదుగాని ఆదిలక్ష్మి వాడిని మరో ప్రశ్న అడిగింది—

'ఎందుకురా అబ్బిగా!' అని.

వాడదేం చెప్పలేదు.

'సెప్పే ఎక్కడుంటాడో.'

'ఎల్తావా?'

'ఎల్లాలి'

'ఎందుకురా?'

'పనుందే. ఒకసారి ఎల్లాలి.' అన్నాడు అబ్బిగాడు విసుగ్గా.

ఆదిలక్ష్మి ఆశ్చర్యపోయింది. దేవుడితో వీడికేం పని! పనేవిటని ప్రశ్నిస్తే చిన్నవాడు చెప్పడు.

'ఎక్కడున్నాడో సెప్పనా' అని అడిగింది ఆదిలక్ష్మి.

'సెప్పు—తొరగా సెప్పు.'

'గుళ్లో ఉన్నాడు'

'గుడంటే—?'

'మనూరి సెరువు లేదా! అక్కడ



రెండు గుళ్ళులేవా! అక్కడ—'అబ్బాయి అట్టే తలూపాడు. ఒకసారి కళ్ళు మూసు మూసుకుని 'దేవుడా!' అనుకున్నాడు. మళ్ళీ ఏం జ్ఞాపకం వొచ్చిందో— 'అమ్మా! నువ్వు కూడు తినే!' అన్నాడు.

వాడి ఆలోచనేమిటో ఆదిలక్ష్మికి అంతుపట్టలేదు. అడిగితే ఆరు నూరైనా అసలుసంగతి అంత సులభంగా చెప్పడు.

'దేవుడు అందరికీ కనిపించడు' అంది ఆదిలక్ష్మి.

'ఎవరికి కనిపిత్తాడు?'

'మంచోళ్ళకి మాత్తరం కనిపిత్తాడు.'

'నాను మంచోణ్ణేనా?' అనడిగాడు అబ్బాయి.

'వో నువ్వు మా బంగారం'

తనకి దేవుడు తప్పక కనిపిస్తాడని అబ్బిగాడు మురిసిపోయాడు.

'మురిసిపో నాన్నా! మన అమ్మగారి ఇళ్యాల ఎదురుకోని రమ్మన్నారు. నువ్వొక్కడికే ఎల్లకు. బాబొత్తే కూడెట్టుకు తినమను' అనిచెప్పి ఆదిలక్ష్మి గుడిసెతలుపు దగ్గిరగా జరిపి ఊళ్ళోకి బయలుదేరింది.

అబ్బిగాడో మూలను జేరగిలబడి, ఏవిటేవిటో ఆలోచిస్తూ కూచున్నాడు.

# దేవుడు

దేవుడు మంచివాళ్ళకి మాత్రమే కనిపిస్తాడని అమ్మ చెప్పింది. ఒకసారి దేవుణ్ణి చూడాలి, అందరికీ మంచివాడైన దేవుడు తన ప్రార్థన తప్పక వింటాడు.

నిన్నరాత్రి నిండుచీకట్లో కట్టుకొన్నదాన్ని కసిరికొట్టి కన్నబిడ్డని బెదరగొట్టి చేతికొచ్చినట్టల్లా చావబాది వెళ్ళిపోయినవాడు ఉస్సురస్సురంటూ తిరిగొచ్చాడు.

'అమ్మేదిరా!' అనడిగాడు కొడుకుని.

అబ్బిగాడు వొణుకుతూ చెప్పాడు.

మల్లన్న కుండ వెతుక్కున్నాడు.

కంచుగిన్నెలో చద్ది పెట్టుకున్నాడు.

కూడంతా కడుపు కెక్కించి, చుట్ట వెలిగించుకున్నాడు.

ఇంకా చినుకులు రాల్తున్న ఆకాశం వొంక చూస్తూ గుమ్మంలో కూచున్నాడు.

ఆకాశంలో సూర్యుడేమూలున్నాడో అగుపించడం లేదు.

బుజ్జిగాడు మెల్లగా గుడిసెలోంచి బయటపడ్డాడు.

చెరువు దగ్గరగా చింత తోపుంది. చెంతనే రావి వేప దాంపత్యం నెరవుతున్నాయి. అటువైపు ఆలయాలున్నాయి. ఆలయాలకు పక్కనే ఆచార్యుల యిళ్ళున్నాయి.

అబ్బిగాడు శివాలయ ప్రాంగణందాటి లోపలకు వెళ్ళాడు. అర్చకులవారు ఆరోజు స్వామివారికి దీపంపెట్టారో లేదో తెలీదు గాని తలుపులు మూసి ఉన్నాయి. అబ్బిగాడెంత ఎదురు చూసినా అసలు వారెవరూ అటు తొంగిచూడనే లేదు. తలుపులు మూసిన గుడిలోపల ప్రపంచాధినేత పవళించే ఉన్నాడో—సామేన సరదుకొన్న పడతితో సరాచికాలే ఆడుతున్నాడో అబ్బిగాడికేం తెలుసు! ఎదురుచూచి చూచి ఎంతకూ ఎవ్వరూ మూసిన తలుపులు తెరవకపోతే, వాడు నిరాశతో వెనక్కు తిరిగాడు. అప్పుడు వైష్ణవాలయం తలుపులు తెరవడానికి ఆచార్యులవారు పట్టుపంచెతో పన్నెనామాలతో వొచ్చారు.

'ఎవర్రా?' అని అరిచారాయన.

భయపడుతూ భయపడుతూ అబ్బిగాడు నాలుగడుగులు ముందుకు వేశాడు.

'ఎందుకురా! ఇటెందుకు వొస్తున్నావురా! ఫో! బయటికి ఫో!' అని గావుకేకలు వేయడం ప్రారంభించాడాయన.

దిక్కు చచ్చిపోయి, వెళ్ళిపోడానికి మనసొప్పక, కనుపించని కరుణామయుడికి అక్కడే నిలబడి చేతులు జోడించాడు అబ్బిగాడు. వాడెరిగినంతలో దేవుడు మంచివాడే! అందరికీ దేవుడు మేలు చేస్తాడు.

'మా బాబుకు మంచి బుద్ధియ్యి దేవుడా! అడు మంచోడయితే సాలు. మా అమ్మని కొట్టకండా ఉంటే సాలు. ఇంకేం వొద్దు. మా బాబును బాగుసెయ్యి దేవుడా!'

'ఇంకా నిలబడ్డావేంరా గాడిదా!' అని అరిచారు ఆచార్యులవారు.

అబ్బిగాడు తొంగిచూశాడు గాని గుడిలో అలముకున్న చీకట్లలో దేవుడు కనిపించలేదు. మళ్ళీమళ్ళీ చూశాడు.

'మంచోళ్ళకి మాత్తరం కనిపిత్తాడు' అని తల్లి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి అబ్బిగాడికి.

'నాను మంచోణ్ణి కాదేమో!' అనుకున్నాడు.

'నాను మంచోణ్ణి కాపోతే పోనీలే.



దేవుడు మంచోడు. బాబుని బాగుసెయ్యి అంతేసాలు. మా బాబు మంచోడయితే నాను మంచోణ్ణి కాపోయినా ఫర్లేదు. దేవుడా! మా బాబును బాగుసెయ్యి! నీకు కోటిదండాలు' అని అనేకసార్లు అనుకున్నాడు అబ్బిగాడు. చెంపలేసుకున్నాడు. చేతులు జోడించాడు.

అయినా వాడికి సంతృప్తి కలగలేదు. దేవుడెలా ఉంటాడో కళ్ళారా చూడాలి. అయినా చెట్టంతమనిషి గుడిగుమ్మంలో నిలబడి 'ఛీ, ఛీ పొమ్మ'ని చీదరించుకుంటూంటే చిన్నవాడు భయపడ్డాడు. దేవుడు మంచివాడనుకున్నవాడు దేవుణ్ణి మంచి చేసుకునేవాణ్ణి దుర్మార్గుడనుకున్నాడు. అందుకే ప్రహరీగోటి, లాగూ పైకి లాక్కుంటూ ఇవతలికి వొచ్చాడు.

రావిచెట్టు తిన్నె మీద రాగిజుట్టుతో, రంగు మారిన తెల్లపంచెతో, పెరిగిన గడ్డంతో, పెదవులపై నవ్వుతో ఒక మనిషి కనిపించాడు. చేయెత్తి చేరబిలిచాడు. దగ్గరగా కూర్చోబెట్టుకున్నాడు.

'నాయనా! నువ్వు గుళ్ళోకెళ్ళావా?' అని అడిగాడు ముసలాయన. అవునని తలూపాడు అబ్బిగాడు.

'దేవుడు బావున్నాడా!' అని అడిగాడు ముసలాయన ముసిముసిగా నవ్వుతూ.

అబ్బిగాడు అమాయకంగా చూస్తూ 'కన్పడలేదు' అన్నాడు. ముసలాడీసారి బిగ్గరగా నవ్వేశాడు.

'దేవుడు కన్పించలేదా! అసలు గుళ్ళో ఉన్నాడో—లేడో ఉన్నాడో! అయినా పిచ్చోడా! దేవుడు గుళ్ళో ఎక్కడున్నాడురా!'

గడ్డం తాత మాటలు వింటే గాభరా ఎత్తింది అబ్బిగాడికి. తిన్నెమీంచి కిందికురికి, మిడుకూ మిడుకూ చూస్తూ నిలబడ్డాడు.

'ఈ గుళ్ళు కట్టించింది నేను. ఈ చెరువు తవ్వించింది నేను. కాని—ఒరే నాయనా! ఇవేళ నన్ను గుళ్ళోకి రానీయడం లేదురా! నేను చెడిపోయానంట! తాగితే మనుష్యులెవరైనా చెడిపోతారా చెప్పరా! ఆడవాళ్ళని తాకితే మనుష్యులెవరైనా చెడిపోతారా చెప్పరా! ఆస్తంతా పోయింది గనక నేను చెడిపోయాను. చేతిలో చిల్లిగవ్వ లేదు గనక చెడిపోయాను. ఎవరి

# దేవుడు

కొంపలూ కూల్చలేదు గనక చెడిపోయాను: తడిగుడ్డతో గొంతులు కొయ్యలేదు గనుక చెడిపోయాను. నేను చెడిపోయాననిచెప్పి వీళ్ళంతా నన్ను గుళ్ళోకి రాకుండా తరిమేశార్రా అబ్బాయ్! ఒరే! గుడి కట్టించిన నాకే దేవుడు కన్పించడం లేదు. నీ కెక్కడ కన్పిస్తాడురా! వెళ్ళు వెళ్ళు అమాయకుడా! నీకు దేవుడెందుకురా! నాకు దేవుడెందుకురా! దేవుడి కివ్వడానికి మనదగ్గరేం వుంది!'

పిల్లవాడు బెదురుకున్నాడు. మరి నిలబడితే ముసలాడు కొడతాడని భయపడి వెనక్కు తిరిగాడు.

'మాట మాట' అన్నాడు ముసలాడు.

పిల్లవాడు వెనక్కు తిరిగి చూశాడు'

'దేవుడు లేడురా! మనుషులకి భయపడి స్వర్గాని కెళ్ళిపోయాడు. మనుషులు మంచివాళ్ళు కానప్పుడు దేవుడు గుళ్లో ఉండడు. ఈగుళ్ళూ గోపురాలూ దేవుడు కోసం కాదు. మనుష్యుల కోసమే'

అబ్బిగాడు గబగబా అడుగులు వేశాడు. వెనకనించి ముసలాడి మాటలు విని పిస్తూనే ఉన్నాయి.

'అసలు దేవుడేలేదు ఉంటే—నే కట్టించిన గుళ్ళోనే ఉండును. నాతో మాట్లాడును. ఒరే అబ్బాయ్—దేవుడసలు లేడురా! భూమ్మీదా లేడు. పైనా లేడు...'

ఇదంతా అయిదేళ్ల వాడికేం అర్థమౌతుంది. గుళ్లో దేవుడున్నాడని అమ్మ చెప్పింది. 'దేవుడా! ఆడిబుద్ధి సరిసెయ్యలేవా!' అని అమ్మ నాలుగైదుసార్లు అనుకుంటే దేవుడు తన తండ్రి బుద్ధిని సరిచెయ్యగలడని వాడనుకున్నాడు. అందికే గుడికి వొచ్చాడు. ముసలాడు చెప్పిన 'దేవుడు లేడ'న్న మాట అతనిచెవిలో మారు మోగుతోంది.

వర్షం మళ్లీ జోరుగా అందుకుంది. వానలో తడుస్తూనే అబ్బిగాడు గుడిసెకు జేరుకున్నాడు. గుమ్మంలో బాబులేదు. తడక జేరవేసుంది. మెల్లగా దాన్ని తోసుకుని లోపలకు వెళ్ళాడు.

గుడిసెలో ఘోరదృశ్యం కుర్రవాడి గుండెల్ని పిండివేసింది.

నట్టింట తల్లి పడుంది.

'అమ్మా!' అని పిలిచాడు కుర్రవాడు ఆ అమ్మ లేవలేదు.

'అమ్మా!' అని అరిచాడు అబ్బిగాడు. ఆ కట్టెకు ప్రాణంలేదని అబ్బిగాడికి తెలీదు.

చిత్తుగా తాగిన మైకంలో చేసుకున్న దాన్ని అయిదు రూపాయలకోసం మల్లన్న పీకపిసికి చంపాడని ఆ కుర్రవాడికేం తెలుసు!!??

దేవుడు మంచివాడు.

పెద్ద వయసువాడైనా పెద్ద మనసున్న వాడు.

ఆపదల్లో చిక్కుకున్న వాళ్ళందరినీ ఆదుకోవడం కోసమే గుళ్ళు కట్టించు కున్నాడు.

అయినా, వట్టిచేత్తులతో దర్శనం చేసుకున్నవాళ్ళ కతగడేం చేయలేదు.

దేవుడు మంచివాడు. మల్లన్నవంటి మనుష్యులకు పాపం! అయువిస్తాడు. మనసిచ్చి, మమత నిలుపుకుని, ఎన్ని కష్టాలనైనా భరించే ఆదిలక్ష్మివంటి ఆడబడుచులను మాత్రం ఆయన రక్షించలేడు.

అయిదేళ్లవాడు అబ్బిగాడు ఇవన్నీ తెలీనివాడు. దేవుడు తన అబ్బను సరిచేస్తాడని నమ్మాడు. కడకు దేవుడేం చేయగలిగాడు!!

అబ్బిగాడు తల్లిశవంమీద పడి ఏడుస్తున్నాడు.

కట్టుకున్నవాడు తన పీక పిసుకుతున్నపుడు ఆదిలక్ష్మి 'దేవుడా!' అని అరిచే ఉంటుంది.

తను నమ్ముకున్న దేవుడే కనికరం వహించనప్పుడు కనిపించని దేవుడేం చేయగలడు?

అబ్బిగాడు నిజం తెలుసుకుంటాడు. అజ్ఞానం చేతిలో మంచితనం చచ్చిపోయిందని తెలుసుకుంటాడు, '. వాడు పెద్దయ్యాక.

'దేవుడా!' అనడు. గుడివంక చూడడు: అప్పటికి గుడి కట్టించిన పిచ్చి ముసలాడు తెల్లగడ్డంతో బతికుంటే అతనితో— 'అవును. దేవుడు లేడు' అంటాడు. ●



C I B A Cosmetics

# బినాకా షార్ట్ హెడ్



మరీ చిన్న కొసలతో



**శుభ్రపరుస్తుంది**
...మరే విధంగానూ
చొరబడలేని
పగుళ్ళలోకి చొరబడి

**చొచ్చుకుపోతుంది**
...మరి ఏటూత్ బ్రష్
చొచ్చుకు పోలేని మూలల్లోకి

బినాకా షార్ట్ హెడ్ కొసలు గుండ్రంగా ఉంటాయి
చిగుళ్ళను ఏమాత్రం గాయపరచవు



**బినాకా టూత్‌బ్రష్ వట్టి టూత్‌బ్రష్ మాత్రమే కాదు, అంతకన్న కొంత అధికం.**

Binaca®

[ULKA-CTB-65 TEL]

# కథలూ - కార్టూనులూ



స్టెప్
కొలకలూరి




అఖిల
నాగచంద్రావతి






గాఢాంధ
కారంలో
ఒక కాంతికిరణం
తేరాలశ్రీ




వైద్యుల వాదు
శ్రీమతి శర్వాణి




# నేను లేచిపోను

యర్రంశెట్టి శాయి

# దేముడు పిలిచాడు

వి. విజయకుమార్










# భామినీ బాడీగార్డు!

అందే గోపాల కృష్ణమూర్తి

# సుబ్బలక్ష్మి సఖుడి కథ






ఈ కథలు
ఆంధ్ర సచిత్ర వార
పత్రిక మే మాసం
సంచికలలో
వెలువడ్డాయి!!




వేసవికాలపు ఎండ బైట చంద్ర నిప్పులను కురిపిస్తుంది. పైన ఫ్యాను గిరగిర బొంగరంలా తిరుగుతూంది.

వీధిలో బిక్షగత్తె పిలుపు అతిదీనంగా చెవులకు తాకుతోంది. ప్రక్కవాటాలో అద్దె కుంటున్న పిల్లల అరుపులు తారాస్థాయి నందుకొంటున్నాయి.

మరో ఎడమ ప్రక్క వాటాలోనుంచి సన్నని సంగీతం మధురంగా చెవులకు తాకుతోంది.

ఇన్ని వింటూనే నేను పుస్తకంలోనే తలపుంచి దీక్షగ చదువుతున్నాను.

బైట పిల్లల అరుపులకు మనసు నిశ్చలంగ లేకపోవటంవలన చదివిన వాక్యమే మరలా చదువుతున్నాను.

గబుక్కున కరెంటు పోయింది.

పేదవాని వేదనలా ఫ్యాను తిరగలేక తిరుగుతోంది!

మెల్లగా ఫ్యాను ఆగిపోయింది.

ఉక్కపోయటం ప్రారంభమయింది. మరో పేజీ త్రిప్పాను,

'బ్రతుకు – భయానకంగ – సాగిపోతున్నప్పుడు ఎంతో ధైర్యంతో ఆత్మవిశ్వాసంతో అడుగు ముందుకు వేయటం నేర్చుకోవాలి సారదీ అని అంటుంది పుస్తకంలోని నాయకి నాయకునితో.

ప్రక్క వాళ్ళింటికి ఎవరో బంధువులొచ్చారు కాబోలు.

'రండి! రండి!' అనే పిలుపులు విన్పిస్తున్నాయి.

మా యింట్లో ఏమాత్రం అలికిడి లేదు, ఒక్క గోడగడియారం టిక్కుటిక్కుమనే శబ్దం తప్ప.

నాన్న అప్పుడే భోజనం ముగించి పైకి వెళ్ళిపోయారు.

సెకండుఫారం చదివే సుధ, ఫిఫ్తుఫారం చదివే ప్రసాద్ స్కూళ్ళకు క్యారియర్‌లో అన్నం తీసికుని వెళ్ళిపోతారు. మధ్యాహ్నం వాళ్ళు యింటికి రారు. సాయంత్రం ఐదుగంటలకు వస్తారు.

నాన్నగారికి పక్షవాతం వచ్చిన దగ్గరి నుండి శారీరకంగ, మానసికంగ ఎంతో కృంగి పోయారు.

– అందరికన్నా పెద్దన్నయ్య బొంబాయిలో వో పెద్ద కంపెనీలో పనిచేస్తూ అక్కడే వో ముస్లిం అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసికొని స్థిరపడిపోయాడు.

మళ్ళీ ఫ్యాను గిరగిర తిరుగుతోంది?

నేను పైకి చూశాను.

కాలం యిలాగే తిరుగుతోంది మరి!

మనిషి పొందే బాధలతో, కష్టాలతో నిమిత్తం లేకుండా దానిపని అది చేసుకుపోతోంది!

బైట ఎండ తీక్ష్ణంగానే వుంది.

దాదాపు ఒంటిగంట కావొస్తుంది.

మరల పుస్తకం చదవటంలో మునిగిపోయాను.

వో అరగంట ఆగిన తర్వాత 'పోష్టు' అనే కేకతో తల పైకెత్తాను.

పుస్తకం ప్రక్కనపెట్టి లేచి కవ రందుకున్నాను.

కవరుమీద అక్షరాలు చూడటంతోనే గుండెలలో ఎన్నెళ్ళనుండో దాగిన ఆప్యాయతకు చిహ్నంగ ఒక తియ్యటి భావన గుబగుబ లాడింది.

కవరు విప్పుతుంటే చేతులు వణకలేదు. హృదయం దడదడ లాడలేదు. కళ్ళు ఆత్రుతతో, భయాందోళనలతో అక్షరమాలను చూడటంలేదు.

అది తెలుగు టీచరుగారు వ్రాసిన వుత్తరం. చాలాకాలానికి వుత్తరం వ్రాసారనే తలపే నాకెంతో తృప్తినిస్తుంది. ఏదో మధురమైన భావనా వీచికలతో, తియ్యని గీతికలతో, మమతల తీగలతో మనసు నిండి పోయింది.

ఆమె నాపట్ల చూపిన అపారమైన ప్రేమానురాగాలకు చిహ్నంగా కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

కన్నీళ్ళ తెరటాల మాటున పదేళ్ళ క్రిందట చూచిన తెలుగు టీచరుగారి మూర్తి కళ్ళముందు సాక్షాత్కరించింది.

పసుపు కుంకుమలు కోల్పోయిన ముఖమైనా, పచ్చటి ఛాయలోని ఆమోములో మందహాసపు బంగారు కాంతులు కన్పిస్తూ వుంటాయి.

ఆమె నేత్రాలు సహృదయతకు, సంస్కారానికి ప్రతీకగా వెలుగులను చిమ్ముతూ వుంటాయి.

ఆమె నల్లని జుత్తులోని అక్కడక్కడి తెల్ల వెంట్రుకలు ఆమె సాహచర్యంలో ఆరితేరిన విద్యార్థులుగా కన్పిస్తాయి. ఆమె చేసిన గొప్పపనులకు అవి నిదర్శనాలు,

నన్నని తీగలాంటి పెదాలపై ఎప్పుడూ చెరగని చిరునవ్వు దోబూచులాడుతూ వుంటుంది.

ఆ నవ్వులో మల్లెలు విరియవు. ఆ నవ్వులో ముత్యాలు అగుపించవు.

కాని సృష్టిలో ఎక్కడా దృగ్గోచరం కాని స్వచ్ఛత తాండవిస్తూ వుంటుంది.

ఎన్నెన్నో అగాధాలను, సుడిగుండాలను, భయంకరమైన జ్ఞాపకాలను, భరింపలేని కథలను, అనుభవాలను మరింకెన్నింటినో గుండెలోని బంగారంలా దాచుకొంటూ పైకి స్వచ్ఛంగా నవ్వగల నైపుణ్యం ఆమెకు పుట్టుకతో వచ్చినదే! ముత్యాల్లాంటి అక్షరాలమీదకు నా దృష్టి ప్రసరించాను.

అమ్మా, రేఖా!

నీ జాబు అందినది. శుభాశీస్సులు!

నీ జాబులో ద్వేషం, రోషం, పగ, కక్షలకన్న ఆవేశంతోకూడిన ఆత్మీయత, మనుష్యులపై పెంచుకున్న మమతానుబంధం, సృష్టిద్వారా నీవు పొందే సంతోషం, తృప్తి, మంచితనంలోగల ఉపదను, వ్యధను ఎక్కువగా వ్యక్తపరిచావు.

పిచ్చి రేఖా!

'ఈ ప్రపంచం మమతల తీగలతో సుందరంగా అల్లుకున్న పందిరిలాంటిది' అన్నావు.

నిజమే! నేను ఒప్పుకొంటున్నాను. కాని మమతే జీవితంగా స్వార్థరహితంగా మనుగడ సాగించుకోవాలనే తపన వుంది చూశావూ! అది కారుచిచ్చులాంటిది.

ఎక్కువ మమత నిన్ను దహించి వేస్తుందని తెలియదా? 'అతి సర్వత్రా వర్జనీయమని' మర్చిపోయావా?

పండ్లు అమ్ముకొనే పడుచుపిల్లను చూచి ఓ ఉన్నతాధికారి వివాహం చేసికోవటమనేది సినిమాలో చూస్తున్నంత సౌందరగ నిత్యజీవితంలో మనం చూడలేము.

మన ముందు కన్పించే వాస్తవం వేరు. సినిమా వేరు

సినిమాలోలాగ ఆదర్శంగా, ఆత్మీయంగా మంచిమార్గాన నడవాలనుకోవటం అవివేకం!

ఏదైన మంచి వుంటే నీవు గ్రహించు కాని అదే అందర్నీ చెయ్యమని ఆదేశించకు!

జీవితంలాంటిది సినిమాకాని సినిమాలాంటిది జీవితంకాదు సుమా!

రోజురోజుకు అధునాతనంగా రూపొందుతున్న యీ లోకంలో నీవు మనసు లెరిగి మసలుకోవటం మర్చిపోతున్నావు

మంచినిచ్చేవాళ్ళకి మంచియివ్వు. చెడు యిచ్చేవాళ్ళకు చెడునే యివ్వు.

కాని చెడును మంచిగా స్వీకరిస్తున్నప్పుడు సంఘం దృష్టిలో నీవొక అప్రయోజకురాలిగా, పనికిమాలిన వ్యక్తిగా ముద్రవేయబడతావు.

ముల్లును ముల్లుతో తీయటానికి ప్రయత్నం చేయి! కాని ఆకుతో తీయాలనే తపనతో వృధాగా శ్రమించి ఆకులాంటి నీ మనస్సును గాయపరచుకోకు!'

వుత్తరం చదవటం ఆపు చేశాను.

అప్పటికే నాకళ్ళల్లో నీళ్ళు చెంపల మీదకు జారాయి.

'అయితే నా మనసు తెలుగు టీచరుగారు కూడ తెలుసుకోలేదా?

నేను, అతిగా పోతున్నానా?

తండ్రి వాత్సల్యం, అన్నయ్య అనురాగం, అమ్మ ప్రేమ ఎరుగని నేను ఆత్మీయత పెంచుకోవటం తప్పా?

లేక అందరూ నన్ను దూరంచేయటం తప్పా? ఈ లోపం ఎక్కడుంది?

మళ్ళీ వుత్తరంపై కళ్ళు నిలిపాను.

ఈ అధునాతన యుగంలో లౌకిక జ్ఞానం ఎంతగా అలవర్చుకోవాలో నీవు పూర్తిగా మర్చిపోతున్నావు.

నిజాన్ని చెప్పకు. అన్యాయాన్ని ఖండించకు. ధర్మాన్ని చాటకు! చూసీచూడనట్లుగా విని విననట్లుగా అంటీఅంటనట్లుగా మసలుకోవాలి!

అంతేగాని న్యాయమంటూ, ధర్మమంటూ కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాడితే ఎన్నో బాధలకు లోనుకావడమే కాకుండా యితరులద్వారా నీవు ఆశించే సహాయం, కొన్ని పనులు ఆగిపోతాయి సుమా!

ఆధునికయుగంలో అంతరాత్మ జోలికిపోకుండ, ఆవేశానికి లోనుకాకుండ, అవసరాలను తీర్చుకోవటం నేర్చుకో!

అలాగాక వాళ్ళుచేసే సహాయంకన్నా వాళ్ళ అంతరాత్మే ముఖ్యమనుకొన్నావా నీవు సమస్యల మైదానంలో పల్టీలు కొట్టవలసివస్తుంది.

అన్నివస్తువులులాగానే అధునాతన యుగంలో 'ఆత్మీయత'ను నిల్వచేసికోవటం నేర్చుకో?

నీవు అక్కరలేదనుకొనేవారినిగురించి ఎక్కువగా ఆలోచించి, బుర్ర బద్దలు కొట్టుకొనేకన్నా నీవు కావాలని నిన్ను ఆశించేవారిని ఆర్ద్రతతో ప్రేమతో ఆహ్వానించటం నేర్చుకో?

ప్రపంచం వో పెద్ద సినిమాహాలు లాంటిది.

సినిమాహాలులో నేలనుండి బాల్కనీ వరకు ఎన్నిక్లాసులున్నాయో అలాగే క్లాసులవారి మనుష్యులు వున్నారని మర్చిపోతే ఎలా?

నేలలో కూర్చున్నా, బెంచీలో కూర్చున్నా బాల్కనీలో కూర్చున్నా సినిమామాత్రం ఒక్కటే! అయినా సినిమాకన్న మనిషి

కూర్చునే క్లాసు ముఖ్యం. క్లాసును బట్టే మనిషిని గౌరవిస్తూ వుంటారు. అది సహజమైన విషయమై పోయింది.

రేఖా! వాకు ఆత్మీయత లేదు, మమత లేదు. అని వైరిగా యితరులపై మమతను పెంచుకున్నందువల్ల నీ హృదయాన్ని కొల్లగొట్టుకుంటున్నావని మర్చిపోతున్నావు.

మీ నాన్ననుండి, తమ్ముళ్ళనుండి అన్నయ్యనుండి దానిని ఎందుకు సాధించలేవు? నీ యింట్లోవాళ్ల దగ్గర పొందలేని నీవు మరెక్కడా పొందలేవు. ముందు నీ యిల్లు ముఖ్యం!

మీ అమ్మ పోయిన దగ్గరినుండి ఎన్నెన్నో బాధలకు, అవమానాలకు, కష్టాలకు లోనై అతిచాకచక్యంగ ఎంతో నైపుణ్యంలో కుటుంబాన్ని లాక్కొస్తున్నారు. నిజమే! కాని వాళ్ళపై మమత పెంచుకున్నాను వాళ్లకు నామీద లేదనుకోవటం వ్యర్థం.

'అసలు నిన్నెవరు మమత పెంచుకోమన్నారు' అనే ప్రశ్న ఉద్భవించినప్పుడు నీవిచ్చే సమాధానం ఏమిటి?

మీ యింట్లో రెండేళ్ళుగా అద్దెకుంటున్నంతమాత్రాన మురళన్నయ్యమీద నీ వెందుకు మమత పెంచుకోవాలి?

వాళ్ళు వెళ్ళిపోవటంతో ఎందుకు వాపోవాలి? మమత, అనురాగం పెంచు

# మమతల తీగలు

కున్నందువలన నష్టపోయిందెవరు? నీవే.

మురళన్నయ్య వుద్యోగరీత్యా ఆయన కర్తవ్యాన్ని నిర్వర్తించుకోవటం కోసం నీ వూరు వచ్చాడేకాని నీపై మమత పెంచుకొని, నీకు వున్నలోటును భర్తీ చేయటానికా? కాదు. ఎంతమాత్రం అలా కాదు.

వుద్యోగరీత్యా వచ్చాడు. మరల ట్రాన్స్ఫర్ కావటంలోనే వెళ్ళిపోయాడు. అది లోకసహజం. కంపార్టుమెంటులోని ప్రయాణీకుల్లా విడిపోవటం, అలా మసలుకోవటం ఎంతైనా అవసరం.

చెల్లెలని నీపై మమకారం పెంచుకొని నిద్రహారాలు మానేసి భార్యాబిడ్డలను పట్టించుకోకుండ నీ దగ్గరే నీ యింట్లోనే వుండిపోవటం చాల అవివేకం. అర్థహీనం.

మల్లెపువ్వులాంటి నీ మమతను వాడనివ్వకు. దాని సువాసనలు నలుదిసలా వెదజల్లటానికే ప్రయత్నించు.

ఈ రోజుల్లో ప్రతిఒక్క మనిషినుండీ అధికంగా 'మనీనే' ఆశిస్తారుకాని నీలా 'మమతను' ఆశించరు సుమా!

ఆ మాటకు అర్థం లేదు. సువాసన లేదు.

వ్యర్థమైన ప్రశ్నలతో నిరర్థకమైన ఆలోచనలతో అమూల్యమైన కాలాన్ని ఎంతగా దుర్వినియోగం చేస్తున్నావో కొంచెం ఆలోచించు!

ఎవరైతే నీపై ఎంత ప్రేమాను రాగాలను కురిపిస్తారో అంతవరకే నీవు తిరిగి యివ్వు. అంతేకాని వాళ్ళు యిచ్చే దానికి రెట్టింపు యిచ్చి బాధలకు, సమస్యలకు లోను కావొద్దు.

దీర్ఘమైన యీ జీవిత కాలంలో యింకా నీవెన్నో అనుభవాలను నేర్చుకోవాలని, నీ భావి వుజ్జ్వలంగ వుండాలని, నీ వెల్లప్పుడూ ఆవేదనతో కాకుండ ఆనందంతో కళకళలాడుతూ వుండాలని మనస్ఫూర్తిగా ఆశిస్తూ ముగిస్తున్నాను.

మీ టీచరుగారు,

అనసూయదేవి.

టీచరుగారి వుత్తరం చదవటం పూర్తి కావటంతోనే నాన్నగారి పిలుపు పైనుండి దీనంగా జాలిగా వినిపించింది.

రెండేళ్ళక్రితం నాన్నగారు తాలూకాఫీసులో సుమాస్తాగ చేస్తూ రిటైరైపోయారు.

అమ్మ వెళ్ళిపోయే నాటికి అన్నయ్య చదువు అయిపోగా మిగిలిన ఆస్తి మూడు పోర్షనులుగల ఒక్క డాబామాత్రమే.

మధ్యవాటాలో మేము వుంటూ యిరు ప్రక్కలా అద్దెకిస్తూ వుంటాము. మా వీధి అంత సెంటరు కాకపోవటం వలన అద్దె తక్కువే. ఒక్కొక్క పోర్షన్కు ముప్పయి రూపాయలు.

ఇటీవలే డాబాపై ప్రత్యేకంగా నాన్నగారి సౌకర్యం కోసరం వో చిన్న గది కట్టించిన కారణంగ నాన్నగారు భోజన సమయంలోనే క్రిందవుంటారు. మిగతా కాలంలో పైగదిమీదనే గడిపివేస్తారు. పైన గది చిన్నదైనా గాలి ధారాళంగా వీస్తుంది. కావలసినంత ప్రశాంతత. ఆ గదిలో వున్నంత సేపు నాన్న బాధలకు సమస్యలకు దూరమై పోతున్నట్లు అనుభూతి చెందుతారు. ఆయనదదొక తత్వం.

తలుపులు దగ్గరగావేసి ఎడమచేతి వైపుగా మెట్లెక్కి పైకి వెళ్ళాను.

నాన్న ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. నా అడుగుల చప్పుడు విని ప్రక్కకు తిరిగారు.



'ఏం నాన్నా పిలిచారా?' అన్నాను.
'నెల పూర్తయిందనుకుంటాను. అద్దె యిచ్చారా?' తీక్ష్ణంగాచూస్తూ అన్నారు.
'లేదు నాన్నా! నేనింకా అడగలేదు.' తగ్గుస్వరంతో అన్నాను
'అలా అడగకపోతే ఎలా! మొహమాటానికిపోతే మన యిబ్బందులు ఏం కావాలి? ఎడమ చేతితో కుడిచేతిని రుద్దుకొంటూ ముఖంలో క్రోధాన్ని ప్రస్ఫుటపరుస్తూ అన్నారు.
నాన్నకు మొదటినుండీ కోపంమెండు. మరీ పక్షవాతం వచ్చిన దగ్గరినుండి యింకా ఎక్కువైపోయింది.
పెద్ద కొడుకును తలచుకుంటూ తిట్టుకోవటం, చిన్న కొడుకులు సరిగా చదవరని ఎప్పుడూ అరుస్తూనే వుంటారు.
ఒక్కొక్కసారి వీళ్ళందరిమీద కోపం నాపై చూపుతూ నన్ను ఎన్నోమాటలు అంటూనే వుంటారు.
అమ్మలాగా నేనూ భరించటం మంచిదనుకుంటాను.
ఆయనకు ఎదురుతిరిగి మాట్లాడితే యింకా కోపం ఎక్కువ.
అయిన దానికీ కాని దానికీ చికాకు పడటం, పెద్దపెద్దగా అరవటం ఆయనకు బాగా అలవాటై పోయింది.
'రేఖా! నీ భోజనం అయిందా?' అని ఎప్పుడైనా అడుగుతారేమో ననుకుంటాను.
ఊహూ...ఆయన మాటలలో లాలిత్యం ప్రేమానురాగం నేనెన్నడూ ఎరుగను.
ఆయనకెందుకో యింట్లో అందరిపై ద్వేషం.
ఒక్కొక్కసారి తండ్రికి ఎన్నోబాధలు చెప్పుకొని ఓదారుపు పొందుదామని, ఆర్థిక సమస్యలగురించీ సలహాలడుగుదామని యింకా ఏమేమో చేయాలనుకుంటాను. కాని ఆయన ఉగ్రరూపంచూచి ఏమీ అడగబుద్దెయ్యదు.
ఎలాగో సమాధానం చెప్పాలనే ఉద్దేశ్యంతో 'అద్దె అడిగి తీసికుంటానులే నాన్నా!' అనిచెప్పి గబగబ క్రిందకు దిగి వచ్చాను.
దుఃఖం కట్టలు తెంచుకు వస్తుంది. నాన్నకెప్పుడూ యిల్లూ, అద్దె,

# మమతల తీగలు

ముగపిల్లలుగురించే కాని నాగురించి ఒక్క అనునయ వాక్యమైన అడుగుతాడేమో నను కుంటాను.

అసలు నాగురించిన ఆలోచన ఆయ నకు లేదు.

కళ్లవెంట నీళ్లు సుళ్లు తిరిగాయి. మురళన్నయ్య జ్ఞప్తికిరాగ హృదయం బాధతో మెలికలు తిరిగిపోయింది

వో రోజు సాయంకాలం 'ఏమండీ యిక్కడ అద్దెకుండే యిళ్లేమైన వున్నాయా?' అని బైట ఎవరినో అడు గుతూవుంటే వరండాలోవున్న నేను.

'ఒక పోర్షన్ ఖాళీగా వున్నదండి రండి!' అన్నాను.

అంత చొరవగా పరాయి వ్యక్తితో పైగా మగమనిషితో మాట్లాడినందుకు నేనెంతగానో సిగ్గుపడ్డాను. బాధపడ్డాను.

ఆయన గేటు నెట్టుకొని లోపలకు వచ్చారు.

మనిషి నలుపు. మంచిపొడవు పొడవుకు తగ్గ లావు. కొన్నిరోజుల క్రిందటే తిరు పతి వెళ్లారు కాబోలు నున్నటిగుండు విశాలమైన పాలభాగం. మమతలో నిండిన కళ్లు. మాటలలో లాలిత్యం, ప్రేమ ధ్వని స్తున్నాయి. చేతిలో చిన్నబ్యాగ్ పట్టు కొని అలాగే నిలబడ్డారు. అనురాగంతో నిండిన ఆయన మూర్తిని చూస్తూ నేను సభ్యతనుకూడ మర్చిపోయాను.

ఆ తర్వాత ఎప్పటికో తేరుకొని 'రండి లోపలకు' అంటూ కుర్చీ చూపించాను.

ఫర్వాలేదంటూనే కూర్చొని గదంతా కలియజూశారు. ఆ తర్వాత వాళ్లుండ బోయే పోర్షను చూపెంచి ఐదు రూపా యలు బయానా తీసికొని గది తాళాలు ఆయన కిచ్చాను.

పద్మనేకొంది ఆయన ముఖారవిందం, మాటతీరు పదేపదే జ్ఞప్తికి రాసాగాయి.

ఇంట్లో అన్నయ్యమీద నాకెంత మాత్రం మమకారం లేదు. తనను పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించి వో గొప్ప వ్యక్తిగ తీర్చిదిద్దిన తల్లిదండ్రులను మరచి, బాధ్యతలను విస్మరించి కనీసం నా వివాహ విషయమైనా ఆలోచించకుండా స్వార్థంతో దూరంగాపోయి సుఖపడు తున్న అన్నయ్యను చూస్తుంటే నాకెంతో కోపం. ఆపై ఎంతో సానుభూతి.

అన్నయ్యంటేనే నాకు అసహ్యం రోత.

అందుకే ఉత్తరాలుకూడ వ్రాయను.

అన్నయ్య చెల్లిపై చూపే వాత్సల్యం నే నెరుగను. తండ్రి బిడ్డపై కురిపించే అనురాగం నేనెరుగను.

'అమ్మవుంటే?' అనే ప్రశ్న నాలో వుదయించినప్పుడు నా మనస్సు భూకం పంలా వణికిపోతోంది.

అన్నివిధాలా నష్టజాతకురాలినే. ఎవరి ప్రేమకు, ఎవరి వాత్సల్యానికి ఎవరి ఆదరణకు నోచని నాకు కన్నీళ్లే మిగు లుతూ వుంటాయి.

ఈ ప్రపంచమంతా ఏదోఒక బంధంతో యింకేవో అనుబంధాలతో ఒకరిపై ఒకరు మమతాను రాగలను నింపుకొంటూ మను గడ సాగిస్తుంది.

అలా నేనెవరిపై మమతను నింపు కోవాలి! అని ప్రశ్నించుకున్నప్పుడు ఆత్మీ యులపై స్నేహితులపై అని సమాధానం వస్తుంది

అందుకే మురళన్నయ్యను ఆనాడే నా హృదయంలో 'అన్నయ్యగ' చిత్రించు కున్నాను.

వో మంచిరోజున అన్నయ్య వాళ్లు సామానుతో భార్య, సంవత్సరం పాప, తల్లితో యింటికి వచ్చారు.

అన్నయ్య సాత్విక తత్వం కలవాడు. చిన్నప్పటినుండి ఒటువంటి తత్వం కల వాడేనట.

మొదట అన్నయ్యతో నేనెన్నడూ మాట్లాడి ఎరుగను. చాటుమాటున అన్నయ్యను చూడటం తప్ప ఆయనను ఎన్నడూ పలుకరించి ఎరుగను. అంతటి లవసరం కూడ లేకపోయేది.

భోజనంచేసి పదిగంటలకు ఆఫీసుకు వెళ్లే అన్నయ్య సాయంకాలం ఐదుగంట లకు గాని తిరిగిరారు

ఆయన పనేమో, ఆయనేమో, ప్రతి ఒక్క మనిషిని సహృదయతలో అర్థం చేసుకోవటం, మంచిగా గుర్తించటం ఆయన సుగుణాలలో చెప్పుకోదగినవి.

దాదాపు ఆయనకు మూడువందలు జీతం వస్తుంది. ఇద్దరు తమ్ముళ్లు బి.ఎస్.సి. చదువుతున్నారు. మరో చెల్లి విశాఖలో ఎమ్. ఎస్. సి. చదువుతుంది.

తన కుటుంబాన్ని పోషించుకుంటూనే తమ్ముళ్లకు, చెల్లికి డబ్బు పంపుతున్నా రంటే నేనెంతో ఆశ్చర్యపోయేదానను.

బాధ్యతాయుతమైన మనుష్యులు ఎక్కడవున్నా ఎందరిలో వున్నా తమ బాధ్య తమ విస్మరించరు కదా!

ప్రతిరోజూ భోజనానికి ముందు దాదాపు గంట గంటన్నరసేపూ పూజచేయటం అన్నయ్య దినచర్యలో ముఖ్యమైనది, ప్రధానమైనది.

అన్నయ్య మంత్రోచ్చారణ వుదయాన్నే చెవులకు సోకుతూవుంటే నేనెంతో శ్రద్ధ తో తన్మయత్వంలో వూగిపోతూ




విజయవాడలో దొంగ లెక్కువంటారు కానీ యింత వరకూ నాకేం నిదర్శనాలు కనిపించలేదు..!

## చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్!




ఫలితములను చూడండి. బట్టలను ఆఖరు సారి జాడించునపుడు కొంచెము టినోపాల్ వేయండి, అప్పుడు చూడండి. బట్టలు, ఎంత తెల్లగా, కళ్ళు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువ్వాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయ్యే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు బాల్చీకి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.




® టినోపాల్ జె.ఆర్. గైగి ఎస్.ఎ. బాల్ స్విట్జర్లెండ్‌వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగి లిమిటెడ్, పి.ఒ బాక్సు 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi HPMA-12/70 Tel

వుంటాను.

కాలం దొర్లిపోతూనే వుంటుంది. మరో క్రొత్త క్యాలెండరు రావటం జరిగింది. మురళన్నయ్య ప్రేమానురాగంలో అసలు అన్నయ్యను నేనెన్నడో మర్చిపోయాను.

నాన్న అరుపులకు, మందలింపులకు, కోపతాపాలకు నేనెంతమాత్రం బాధ పడటం లేదు. అన్నయ్య అనురాగపూరితమైన పల్కులకు నేను సర్వం మర్చిపోయేదానను.

తమ్ముళ్ళు సరిగా చదవటం లేదనే చింతను కూడ విస్మరించాను.

అన్నయ్యమీద నాకెందుకో అవ్యాజమైన భక్తి. అనంతమైన అనురక్తి. జీవితాంతం. అన్నయ్యగా గుండెలో స్మృతిని మిగుల్చుకోవటమే నాకు ముక్తి. అని యింకా ఏవేవో మధుర భావనలతో, తియ్యని ఆలోచనలతో, కమ్మని కలలతో కాలక్షేపం చేయటం పరిపాటైపోయింది.

సాయంకాలం వేళలో పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి. వాటితో పోటీపడుతూ ఆరుబైట పిల్లల కేరింతాలు. ఇరు ప్రక్కల రెండు వాటాంలలోనూ అద్దె కుంటున్నారు. ఎడమవైపు వాటాలో పల్లెటూరునుండి షరుదుకు హాస్పిటల్‌కు వచ్చినవాళ్ళు. వాళ్ళతో నేను కలివిడిగా వుండేదానను కాదు. వుండాలని అనిపించేది

# మమతల తిగలు

కాదు. అసలు ప్రక్కవాటాలో మనుష్యులున్నారనే భావనే కలిగేది కాదు.

నీరు పల్లాన ప్రవహించటం ఎంత సహజమో మమత వున్నచోట మనసు చోటు చేసికోవటం అంత సహజమేమో.

దూరంగా అన్నయ్య సైకిలు వేసికొని రావటం చూశాను. ఆలోచనలమాల పుటుక్కున తెగింది. అన్నయ్యవైపు వోసారి చూసి లోపలకు వచ్చేశాను

'రాజీ! మనకు ట్రాన్స్‌ఫర్ అయింది' అన్నయ్య గొంతు.

'ఏవూరండీ!' వదిన ప్రశ్న.

'నర్సాపురం!' ధీమాగా ధ్వనించిందా కంఠం.

నాలో ఒక్కసారిగా ఎర్రగా కాలే నిప్పులపై నీళ్ళుపోసిన పిదప ఘోష లాంటి ఘోష బయలుదేరింది.

నాకున్న బాధ, ఘోష, తపన అన్నయ్యకు లేవా?

ఎవరో అద్దెకుంటున్నవాళ్ళు వెళ్ళిపోతుంటే నాకెందుకు బాధ? నా కడుపులో మంటెందుకు? నా హృదయం బ్రద్దలు కావటం ఎందుకు?

వాళ్ళకు బాధగా లేదే!

పిచ్చిదానా! వాళ్ళకెందుకుంటుంది బాధ! వాళ్ళు వుద్యోగరీత్యా వచ్చిన మనుష్యులు! మరో వూరు వెళ్ళవలసివచ్చింది వెళ్ళిపోతున్నారు!

నీ యింట్లో మమత లోపించటంవలన —వెర్రిగా వాళ్ళు నీపై పెంచుకోకపోయినా —పిచ్చిగా వాళ్ళపై పెంచుకున్నావు. బాధ పడుతున్నావు. వేదన చెందుతున్నావు.

వాళ్ళు నీపై మమకారం పెంచుకునే అవసరం ఏముంది? ఆయనకు ప్రేమానురాగాలు కురిపించే తల్లిదండ్రులు, ఆప్యాయంగా ఆదరించే అక్క చెల్లెళ్ళు, తమ్ముళ్ళు. అంతకన్నా ప్రేమను గుమ్మరించే భార్య, ముద్దుమాటలతో అలరించే కూతురు.

ఏ లోపంవలన నీపై మమత పెంచుకోవాలి?

కాకపోతే వాళ్ళ అవసరార్థం నీకు అద్దె యిచ్చి నీ యింట్లో వున్నారు. అంతే!

కొన్నాళ్ళు పరిచయస్థులేగాని మీ యిద్దరిమధ్యా ఏ బంధమూ లేదు. ఇలా ఎన్నో చెప్పింది అంతరాత్మ.

అంతేనంటావా? ఏవిధమైన మమతాను బంధం లేదంటావా?

వెర్రిదానా! 'మమత' అనే మాటకు ఈ రోజులలో 'అవసరం' అని చెప్పుకోవాలి. అర్థంలేని ఆత్మీయతకు, సౌహార్ద్రతకు పోవటం చాలా అవివేకం సుమా! హెచ్చరించింది.

వెచ్చటికన్నీరు చెంపలపైదుగా జాలువారాయి.

రెండురోజులలో అన్నయ్యవాళ్ళు వెళ్ళిపోతారనగా అన్నయ్యను, వదినను భోజనానికి పిల్చాను.

పదార్థాలు వడ్డిస్తూవుంటే నా చేయి వణికింది. గరిట కదలాడుతూవుంటే అన్నయ్య నా కళ్ళలోకి చూశారు.

ఆ చూపులలో ఎన్నేళ్ళనాటిబంధమో దాగివున్నట్లనిపించింది.

ఆ కళ్ళల్లో మమత ఆర్ద్రత కన్పించాయి

ఆయన నా గురించి బాధ పడుతున్నారా?

మరునాటిరోజు సర్కారుకు అన్నయ్యవాళ్ళు వెళ్ళిపోతున్నారనే వూహ నిర్మలమైన నీటిమీద బాణ్కెనవేసి ధబీలున కొట్టినట్లనిపించింది.



భయంకరమైన అగ్నిజ్వాలలు నాలో బయలుదేరాయి. మనసంతా అస్తవ్యస్తంగానే వుండిపోయింది.

యాంత్రికంగానే నాన్నకు తమ్ముళ్ళకు భోజనాలు పెట్టాను.

లోకమంతా అంధకారంగా శూన్యంగా నిర్వికారంగా కన్పించింది.

అమ్మ పోయినరోజుకూడ నేనంత బాధ అనుభవించలేదేమో!

వేకువఝామున అన్నయ్యా వాళ్లు వెళ్తావుంటే వీధి చివరదాకా నిండా పవిట కప్పుకొని శూన్యంలోకి చూస్తూ వెళ్లాను. రిక్షా కదలబోతుండగా 'అమ్మా వెళ్లొస్తాను. జాగ్రత్త!' అన్నారు.

ఎర్రనికడ్డీతో నా వీపుపై వాతపెట్టినట్లుంది. వాళ్ల రిక్షా తారురోడ్డుమీద, సిమెంటురోడ్డుమీద పోవటంలేదు. నా హృదయంమీద దయాదాక్షిణ్యాలు లేకుండ సాగిపోతుంది.

'ఛీ ఎవరిపై మమత పెంచుకోకూడదు.' మొదటిసారిగా అనుకున్నాను.

ఎడతెరిపి లేకుండ కళ్లనీళ్లు కారిపోయాయి. ఆరోజు చాలా నిశ్శబ్దంగా ఎవ్వరికీ తెలియకుండ చాలాసేపు యేడ్చేను.

వదిన వెళ్తావెళ్తూ నా చేతిలో పెట్టిన పది రూపాయలనోటును నలిపివేసాను. వాళ్లనుండి నేను ఆశించింది—

మనీనా? మమతనా?

ఇవి నా కర్థంకాని, నే నాలోచించ శక్తిలేని పేలవమైన ప్రశ్నలు!

ప్రక్కింట్లో వున్న అమ్మాయి ప్రసవించటం, పురుగు పోసుకోవటం వెళ్లిపోవటం మరో వారంరోజులలో గడిచిపోయాయి.

రెండు వాటాలూ ఖాళీగా వున్నాయి. అన్నయ్య పోవటంతో నా మనసంతకు మునుపే ఖాళీ అయ్యిపోయింది.

ప్రతిపనిని హృదయపూర్వకంగా చేయలేకపోతున్నాను. నాన్నను తమ్ముళ్లను ఎక్కువగ పల్కరించటంలేదు. అడిగినదానికి 'ఉ...' లలోనే సమాధాన మిస్తున్నాను.

ఒకటే తలనొప్పి. జ్వరం వచ్చినట్లుగా వుంది. వూరంతా జ్వాలలు వున్నాయి. బహుశ ఆ జ్వరం నాకు వచ్చి చచ్చిపోతే ఎంత బాగుండును? అనుకున్నాను.

మరునటిరోజు జ్వరం రానే వచ్చింది.

నాన్నగారికి సదుపాయం లోపించిందని సాధిస్తూనే వున్నారు. తమ్ముళ్లిద్దరూ వంట ప్రయత్నంలో మునిగి పోయారు. ఒక్క తమ్ముడైనా కాఫీ పెట్టి యిస్తాడనీ, ఆప్యాయంగా 'అక్కా వంట్లో ఎలా వుందని' అడుగుతాడని ఎంతగానో ఆశించాను. సాయంకాలం వరకూ అలాంటిదేమీ జరగలేదు.

బెజవాడలో చూచిన గాంధీగారి విగ్రహం కళ్లముందు నిలిచింది.

ఈ ప్రజలకోసం, ఈ దేశంకోసం ఆయన బలైపోయారు. అటువంటిది నేనే పాటి దానను!

బాపూజీ అంటే నాకు ప్రాణం. ఆయనను నే నెన్నడూ చూడలేదు. ఆయన వుండగ నేను పుట్టలేదు. ఆయనతో మాట్లాడలేదు.

వయస్సుతోపాటుగ కొద్దిపాటి విజ్ఞానంతో ఆయన దేశానికి 'జ్యోతి'లాంటివాడని ఊహించాను.

మమతా పూరితమైన ఆర్ద్రత మనసులో తొణికిసలాడగ కన్నీటిబిందువులు దిండుపై ముత్యాల్లా రాలాయి.

ఈ సమయంలో నాకేదో కావాలి! ఎవరైనా ఆర్ద్రతతో పల్కరించాలి! ఎవరైనా ప్రేమతో నా తల నిమరాలి! ఎవరైన అనురాగంగా నా మేనును నిమరాలి! సానుభూతి సూచకంగా ప్రేమగా జాలిగా నన్నెవరైనా చూడాలి! మనసు క్రమేపి శాంతిని కోల్పోయింది. అంతులేని అలజడి అంతరంగంలో ప్రారంభమై పోయింది.

తమ్ముళ్లిద్దరూ ఏదో తిట్టుకొంటున్నారు వంట చేసుకోలేక. పెనుగాలిలోని చెట్టులా మనసు వూగులాడడం ప్రారంభమైంది. ఒక్క మురళన్నయ్య మీదే నేను మమత పెంచుకోలేదు. యింకా మా యింట్లో వుండిపోయే ప్రతివ్యక్తిమీద మమత పెంచుకున్నాను.

ఆర్ద్రతతో కూడుకున్న ఈ నిండు మనస్సుకు మమతలతీగలు అల్లుకుంటే ఎంతో అందంగా మధురంగా వుంటుంది! కాని నాకది లభ్యం కాలేదు.

నాలుగేళ్ల క్రిందట మాయింట్లో అద్దెనుండిపోయిన నీరజ గుర్తుకువచ్చింది. నీరజంటే నాకు ప్రాణం. చేసే వుద్యోగం వదిలివేసి పెళ్లి నిశ్చయం కావటంతోనే వుద్యోగం, వూరు వదిలేసి పెళ్లిచేసికొని పిల్లలతో హాయిగా సుఖిస్తోంది! ఆనాటి నీరజను నేను ఈనాటికి మర్చిపోను. అప్పుడప్పుడూ వుత్తరాలు వ్రాస్తూ వుంటాను.

'తీగ అల్లుకున్న బొంగుకర్ర ఏదో వుధృతమైన గాలికి పడిపోగా తీగ అల్లుకోకుండా వూరుకొంటుందా! 'మమత సమత' అంటూ ఏమిటీ కథలలోని మాటలు! అన్నయ్యలు, తమ్ముళ్లు స్నేహితులపై మమత పెంచుకోవటం కాకుండ శాశ్వతమైన మమత కోసం అంటే నీ భాగస్వామి కోసరం, ఆ మమత కోసరం ఆరాటం చెందటం నేర్చుకో! అదే నిజమైన మమత. అదే నిజమైన ఆర్ద్రత! అందులో నీకు అనంతమైన తృప్తి వుంది. ఆనందం వుంది. అందం వుంది అంటూ పోనాడు వుత్తరం వ్రాసింది.

ఆమాటలు తలపుకు రావటంతో నా ఆలోచన మరో క్రొత్తమలుపు తిరిగింది.

ఇదే నీరజ చెప్పినమలుపు. ఇంట్లో వేడి ఎక్కడికో పారిపోయి [illegible] పెంచింది. ఇరవయ్యేళ్ల ఈ జీవితకాలంలో ఎప్పుడూ పొందని వొకింత అనుభూతి పొందగా కంఠంవరకూ దుప్పటి కప్పుకుని తృప్తిగా కళ్లు మూసుకున్నాను.

## ఇది మీకు తెలుసా?

* దరిదాపు మందులా వాడొచ్చు దీన్ని.

* గర్భిణీ స్త్రీలు మూడు అవున్సులు, పసిబిడ్డ తల్లులు అయిదు అవున్సులూ వాడవచ్చునట.

* డయిబెటిక్ వ్యాధిగ్రస్తులు, లావుతగ్గాలని పిండిపదార్థాలు తగ్గించినవాళ్లు రోజుకి తప్పదు ఆరు చెంచాలు వాడవచ్చు.

* ఆహారంలో అన్నిరకాల పప్పులు వాడాలి.

* సాధ్యమైనంతవరకు ముడిధాన్యంగా వాడాలి.

—శై. రా.




**జరిగిన కథ**

స్వామికి స్కూల్లో టీచరు ఉద్యోగంతోపాటు రఘుపతిగారింట్లో ఆశ్రయంకూడా దొరకటంతో అదృష్టవంతుడిని అనుకున్నాడు. అయితే రఘుపతి గారమ్మాయి పావనికి ప్రైవేటు చెప్పాల్సి వచ్చేటప్పటికి అతడికి పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్లయింది. పావని గడుగ్గాయి. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ వుండే ఆ అమ్మాయి స్వామికి కాస్త ఇబ్బందిగానే తయారయ్యింది. పావనికి సంబంధాలు వస్తున్నాయి పోతున్నాయి. ఒకటీ కుదరడంలేదు. స్వామి వేషభాషల్ని మార్చేసింది పావని. అతనిప్పుడు మంచి సంపాదనపరు డయ్యాడు.

## 13

శ్రీదేవిని చూడాలనిపించింది. సినిమా అయిపోయింతర్వాత — సీతమ్మగారి యింటికి వెళ్లారు ముగ్గురూ. అదొక చిన్న పెంకుటిల్లు. ఒకటే గది. నులక మంచంగాక, కూర్చుంటానికి మరేం కనిపించలేదు.

'అత్తగారింట్లో అడుగు పెట్టటం యిదే మొదటిసారి కామల్లె తల్లీనీకు' అంటూ జారిపోతున్న పమిటను సర్ది వంటిచుట్టూ కప్పి 'అత్తగారి దగ్గర వినయంబు నటియింపుము' అంది జబ్బ గిల్లుతూ.

సంబరపడి పోయింది సీతమ్మగారు. మంచంవేసింది కూర్చుంటానికి. 'రాత్రి కలొచ్చిందిరా స్వాములూ నీమీద. ప్రొద్దుట నుంచి ఆ వేపచెట్టుమీద కూర్చొని ఆ వెర్రికాకి అరుస్తున్నది అరుస్తున్నట్లే వుంది. అనుకుంటూనే వున్నా వస్తావని. కాని కోడలు పిల్లను గూడా వెంటబెట్టుకొస్తావనుకోలేదు!' ఉదయం నుంచి అరుస్తున్న కాకిమీద వల్లమాలిన ఆపేక్ష ముంచుకొచ్చింది సీతమ్మగారికి. భోజనం చేయకుండా కదలడానికి వీల్లేదని పట్టుపట్టింది. భారతి వెంట వుండటంతో భయపడ్డాడు కాని 'ఫర్వాలేదులెండి. యింటికిపోయి మాత్రం నేను ఎవరికోసం ఎదురు చూడాలి గనుక.' అంటూ సీతమ్మగారి మాటకు భారతి సాయం చెప్పడంతో మారుమాట చెప్పలేక పోయాడు స్వామి. 'నిమిషంమీద చేస్తా వంట' అంటూ గది ప్రక్కన వసారాలోకి పరిగెత్తింది సీతమ్మగారు. మరుక్షణం వసారాలోంచి కేక పెట్టింది కొడుకును.

'శ్రీదేవి యిక్కడేవుంది తెలుసురా?'

శ్రీదేవిని గురించి నిమ్మదిగా రహస్యం చెబుతున్నట్లు ఎన్నో సంగతులు చెప్పింది జాలిపడుతూ. 'దాని బ్రతుకిలా బ్రద్దలయింది' అంటూ కళ్లు తుడుచుకుంది. మనచేతుల్లో ఏముందిరా? అంతా ఆ పరమేశ్వరుని లీలా విలాసం. అంతా సలక్షణంగా జరిగితే మీ యిద్దరూ మనింట్లో కళకళలాడుతూ తిరగవలసింది. కానీలే. అబ్బాయికి మాత్రం అదంటే ప్రాణం. యాభయ్యో అరవయ్యో తెచ్చుకుంటున్నాడు.'

ఇంతకు తెగిస్తుందని శ్రీదేవి— ఎన్నడూ కలగనలేదు స్వామి. టూరింగు సినిమాలో రిప్రజెంటేటివుగా పని చేస్తున్న ఒకతనితో లేచి వచ్చిందట.

'అంత పిరికిమనిషి అంతధైర్యం ఎలా వచ్చిందమ్మా?'

'సరే! చచ్చే పరిస్థితివస్తే బ్రతుకును గురించీ ప్రపంచం గురించీ ఎవరు భయపడతార్రా. కుందనపు బొమ్మలాంటి పిల్లను—పదిలక్షలున్నాయని ఆ ముసలి పీనుక్కి యివ్వడమెందుకూ? వాడు హరీ అనగానే—మళ్లీ సంబంధాలంటూ బయలు దేరడం—అది తలదువ్వుకున్నా—మంచి చీర కట్టుకున్నా —లేచిపోతావుటే-అంటూ, రాచి రంపాన పెట్టటం—ఖర్మకాక ఏమిటంటావ్? ప్రాణం విసిగీ—వేజేతులా ప్రాణం తీసుకోలేక చివరకు—అంత పనీ చేసింది. బంగారుతల్లి, వెతికి చూచినా దానిలో తప్పుందిరా లోకులు కాకులుగానీ.'

ముందు గదిలో మంచంమీద భారతీ—పావనీ — కబుర్లలో మునిగిపోయారు. తల్లిదగ్గర అడ్రసు షుమారుగా కనుక్కొని 'వంట అయేలోగా శ్రీదేవిని చూసి వస్తానమ్మా' అంటూ బయలుదేరాడు స్వామి.

'ఇంత అర్ధరాత్రివేళ ఎక్కడికండోయ్ బయలుదేరారు మాష్టారూ?'





'ఇంకా వేది కాలేదు. అరగంటలో వస్తా'

'కారులో వెళ్లండి'

'అవసరం లేదు. దగ్గరేగా'

'జమీందారుగారి సత్రం వెనకసందులో దీపస్తంభం ఎదుటగల పెంకుటిల్లు.'

ఇల్లు వెతికి పట్టుకుంటానికి ఎక్కువ సేపు పట్టలేదు స్వామికి.

అప్పుడే సిగ్గుపడుతున్న యౌవన మాధుర్యాన్ని వోణీలతో కప్పుకుంటానికి ప్రయత్నిస్తున్న శ్రీదేవి రూపంమాత్రమే గుర్తు తనకు. చాలా సంవత్సరాలక్రితం చూసిన రూపం. అసలు చూసి గుర్తుపట్టగలనా? అనుకున్నాడు. రోజురోజుకూ క్షణక్షణానికీ మారుతూ, నన్నటి సెలయేరు నిండి పరవళ్లుత్రొక్కే మహా స్రవంతిగా మారినట్లు — స్త్రీజీవితంలో కూడా అటువంటి దశ గడుస్తుంది ఒకసారి. ఆ దశలో అడుగుపెడుతున్న—నిజానికి పెట్టబోతున్న శ్రీదేవి మాత్రమే తనకు గుర్తు.

ఆవీధి దీపపు వెలుతురులో యింటి దగ్గరకు నడుస్తున్నప్పుడు స్వామి శరీరం కంపించింది. అది భయం కాదు. అంత రాత్రి సమయంలో ఆ యింటో కాలుపెడుతున్న తనకు, చాలాకాలం తర్వాత ఆమెను చూస్తున్నాననే ఆనందోద్వేగం కాదు. అన్ని కష్టాలనూ కన్నీటినీ అంత లేత వయసులోనే ఆమె అనుభవించిందన్న బాధ కాదు. ఏ ఒక్కటీ కాదు. అన్నీ. అన్నీ. నిర్వచనానికి అందక—మనిషి అనుభవించే ఒక చిత్రమైన అనుభూతి. ఆ కొద్ది వ్యవధిలో మెదడు గుహల్లో కోట్ల సంఖ్యలో దాగిన చిన్ననాటి అనుభవాలూ జ్ఞాపకాలూ కరిగిపోయిన కలల మాదిరి, ఒరిగిపోయిన అలల మాదిరి, ఆరినా ఆవంత మిగిలిన కాంతితో అస్పష్టంగా కదులుతున్న మెరవుతునకల మాదిరి—

ఒక్కమాటలో

ఆరిపోయిన అత్తరుగుడ్డను యింకా వదలని పరిమళం మాదిరి—

శైశవమాధుర్యం కదిలించి అతని గుండెల్లో నిండి—

శ్రీదేవి తలుపు తీసింది.

* * *

'గుర్తుపట్టవనుకున్నాను శ్రీదేవి'

'అలా యెలా అనుకున్నావు బావయ్యా! పిచ్చి దయ్యాన్నయితే మాత్రం నిన్ను

కుతిచిపోతానా? మరీ దొరబాబులా వేషం వేసుకొస్తే ఒక క్షణం కన్ను చెదిరిం దంతే.ఎంత మారిపోయావు బావయ్యా?'— నవ్వింది శ్రీదేవి. ఆ బుగ్గమీద సొట్ట ఇప్పటికి చెరిగేది కాదు. చెరగలేదు.

'నువ్వుమాత్రం మారలా?'

'మారాను. రోజులు మనిషిని ఎల్ల కాలం ఒకే మాదిరిగా బ్రతకనిస్తా యంటావా? కాని నీలో వచ్చిన మార్పుకీ నాలో వచ్చిన మార్పుకీ తేడా లేదంటావా?'

నిట్టూర్చాడు స్వామి.

'ఒకరోజు నిన్ను వెతుక్కుంటూ నేనే వద్దామనుకున్నా. వచ్చివుంటే అంత శిక్ష నాకు విధించేవాడివి కాదు. ఆడజన్మ ఎత్తటంలో తవ్వంతసిగ్గు అడ్డం వచ్చింది. బ్రతుకే మండిపోయింతర్వాత ఆమాత్రం ఎందుకు తెగించలేకపోయానా అని బాధ పడ్డాను. నా ఉత్తరానికి కనీసం జవాబన్నా ఎందుకు రాయలేదు బావయ్యా?'

'ఏ ఉత్తరం?'

'నీకు తెలీదూ? నిజం చెప్పు?'

'తెలును'

'మరెందుకు జవాబువ్రాయలా?'

'అప్పటికింకా ప్రపంచాన్ని అర్థం చేసుకోలేకపోయాను'

'ఇప్పటికి అర్థం చేసుకున్నావా?'

'కొంతవరకూ'

'ఆ కొంతవరకూ ఏమిటో కాస్త చెబుదూ?'

# మమత

'ఏం చెప్పను?'

'నువ్వు ఏం చెప్పినా వింటాను. ఎంతసేపయినా'

'పదకొండయింది'

'అవనీ'

'ఆయనెప్పుడొస్తాడు?'

'ఎందుకు?'

'చూద్దామని'

'నువ్వొచ్చింది నన్ను చూడటాని కను కున్నాను'

'నిన్నూ ఆయన్నూ'

'ఆయనలో చూడతగ్గ విశేషం ఏం లేదు. ఆయన కాళ్ళూ చేతులు విరగ్గొట్టించాలని చూస్తున్నాడు నాన్న. సినిమా వని నీకు తెలిసే వుండాలి. రెండో ఆట వదిలిన గంటకుగానీ యింటికి చేరడు'

'చూసి వెళ్దామనుకున్నా—కాని'

'మీ ఆవిణ్ణెప్పుడు చూపెడతావ్? ప్రేమించి పెళ్ళి చేసుకున్నావట. ఆవిడలో నీకు అంతగా నచ్చింది ఏముందో చూడ్డా మనిపిస్తుందొక్కసారి'

'అబ్బే అదేం లేదు'

'నాకు తెలుసులే' నవ్వింది శ్రీదేవి లేస్తూ.

'ఎందుకు కంచం కడుగుతున్నావ్?'

'భోం చేయాలి'

'ఎవరు?'

'నువ్వే'

'అమ్మ అక్కడ అన్నం వండుతూంది'

'నేను యిందాకనే వండాను'

'నా కోసం కాదుగా'

'నీ కోసం వండే అదృష్టం నాకు దక్కనిచ్చావా నువ్వు?'

నిట్టూర్చాడు స్వామి లేస్తూ.

'ఎందుకు లేస్తున్నావ్?'

'వెళ్ళాలి శ్రీదేవీ'

'నువ్వు వెళ్ళేవాడివని తెలుసు బావ్వయ్యా. కాని ఏ పచ్చడి మెతుకులో, రాకరాక, అందరూ వెలివేసినా, చిన్ననాటి అపేక్షను గుర్తుపెట్టుకొని వచ్చావా మరి.వడ్డించిన్నం టంటే తృప్తి నాకు'

'మరొకసారి వస్తా'

'నువ్వు మరొకసారి రాకపోయినా బాధ లేదు. ఈ పూట నా చేతి అన్నం తిన కుండామాత్రం వెళ్ళనివ్వను. అడగరాని వరం అడగలేదు బావయ్యా.'

తలెత్తి చూశాడు స్వామి.

నవ్వింది శ్రీదేవి. అదే సొట్ట ఆ బుగ్గమీద. స్వామి మనస్సు తడిగుడ్డ పిండినట్లయింది.

'ఏ యిష్టం శ్రీదేవీ'

'నా జీవితంలో ఏదీ నా యిష్టప్రకారం జరగలేదు బావయ్యా. చివరకి ఏం జరిగినా—ఆ పరిస్థితికి యిష్టపడటం నేర్చుకుంటున్నా.'

భోజనం వడ్డిస్తూ చిన్ననాటి కబుర్లు చెబుతూంది శ్రీదేవి. గది నాలుగుప్రక్కలా పరికించి చూశాడు స్వామి. పెద్దహాలును తడికలతో విడగొట్టారు. ఒకటే గది. బయట ప్రపయం వచ్చినా గాలీ వెలుతురూ గదిలోకి ప్రవేశించే ప్రమాదం లేదు. గోడల నిండా సినిమా ఎడ్వర్టయిజ్‌మెంట్లు తాలూకు వాల్‌పోస్టర్లు పొగచూరి కనిపించాయి.

'నెయ్యి లేదు బావయ్యా. వెల్లుల్లి పాయకారం. కానీ—చెంబెడు మంచి నీళ్ళున్నాయి ఆత్మరక్షణకు'

'ఫర్వాలేదు. కాని శ్రీదేవీ—అటువంటి యింట్లో పుట్టావు. యిలా బ్రతకవలసిన అవసరం?—ఈ పరిస్థితికి అర్థం'

'వళ్ళు మదించి— అన్నాడు నాన్న. కడుపున చెడబుట్టింది—అంది అమ్మ. పశుకామం అన్నారు పదిమందీ. ఇద్దర్నీ



ఏదో వెళ్ళకాడు సెక్షను ప్రకారం—జైలుకు పంపిస్తానని బెదిరించాడు మా వకీలు మామయ్య. వాళ్ళమ్మాయి పెళ్ళి కాకుండానే లేచిపోతే రెండోకంటివాడికి తెలీకుండా వలుపుపెట్టి బాది మరో అభాగ్యుడికిచ్చి పెళ్ళిచేశాట్ట. గప్‌చిప్‌గా యింటికి తిరిగి రమ్మంటూ నాన్న తరపున రాయబారం వచ్చాడు.'

'వెళ్ళలేదన్నమాట?'

'వెర్రిబావా! వెళ్ళివుంటే నీకీనాడు యిక్కడ కనిపించివుండేదాన్నా?'

'ఏమిటో ఈ జీవితాలు!'

'అన్నం తిను బావయ్యా! పెరుగుంది. పులిసిందనుకో? రవ్వంత ఉప్పు వేస్తా. నేనూ ఆలోచించా. నేను యింత సాహసం చేస్తానని ఎవ్వరూ అనుకోలేదు. నేను మాత్రం అనుకున్నానా? మా వూరు టూరింగ్ సినిమా పుణ్యమాఅని ఈమాత్రం దోవ దొరికిందిగానీ. పెళ్ళన్నారు—అదేమిటో నాకు తెలియకుండానే. ఆరు నెలలు తిరక్కుండానే—విధంరికం వచ్చిందన్నారు. అందరూ నన్ను కావలించు కేడ్చారు. అదేమిటో నాకు తెలియలా. ఏదో నాటకం చూసినట్లు చూశా. తర్వాత తెలిసింది మొగుడు రావడానికీ పోవడానికీ అర్థం. ముఖాన బొట్టు చెరిపేశారు. పెట్టెడుచీరలు కట్టుకో నిచ్చేవారుకాదు. వీధిలో నుంచుంటే తప్పు. తలదువ్వుకుంటే తప్పు. మంచి చీర కట్టుకుంటే తప్పు. రెండో పెళ్ళి చెయ్యమన్నారు. తోకత్రొక్కిన త్రాచులా ఎగిరిపడ్డాడు నాన్న ముందు. చివరకు కొంత తగ్గి మళ్ళీ మీ యింటికి వచ్చాడు. అమ్మపోరు పడలేక వచ్చాడని నా అనుమానం. నీకూ అత్తయ్యకూ దయ కలగలేదు. నాన్న మీ కుటుంబానికి అన్యాయం చేశాడనుకో. అందుకు నన్ను శిక్షించావు బావయ్యా నువ్వు—'

నివ్వెరపోయి చూశాడు స్వామి.

కట్టలు త్రెంచుకువస్తున్న ఉద్రేకాన్ని ఆపుకుని 'ఏమిటో మరీ పిచ్చిదానిలా వాగుతున్నా. ఏం అనుకోకు. మీయింటికి తీసుకెళ్ళి మీ ఆవిణ్ణి నాకు చూపెట్టాలి మరి. అంత రంభా ఏమిటి?' అంది తొందరగా తడబడుతూ ధోరణి మార్చి.

'వస్తా శ్రీదేవీ! వాళ్ళు కంగారు పడుతున్నారేమో పాపం!'

**'ఈసారి మీ ఆవిణ్ణి తీసుకురావాలి'**




ఇంగ్లీషులో వీటని 'సిలయన్స్' అంటార అమెరికా, పసిఫిక్, అట్లాంటిక్ తీరాన ఉంటాయి. వీటికి దగ్గర బంధువులే "సీలు" అని పిలవబడేవి వీటన్నిటికి శరీరం ఈదడానికి వీలుగా కండె ఆకారంలో ఉంటుంది నీటిలో సునాయాసంగా త్వరగా ఈది చేపల్ని, రొయ్యల్ని, పీతల్ని పట్టి తింటాయి. వాటి కాలివేళ్ళు కలిసి తెడ్డు ఆకారంలోనూ ఉంటాయి. నీటిలో అంతచక్కగా నడవగలిగే వీటి నడక వికారంగా, అతి కష్టంతో సాగిస్తున్నట్టు ఉంటుంది. సాగర సింహాలకి చెవిడిప్ప లుంటాయి మెడ కూడా స్పష్టంగా ఉంటుంది కాని సీల జంతువు మెడ అంత స్పష్టంగా ఉండదు. చెవి డిప్పలుండవు. ఏనుగు సీలు అనేదాని ముక్కు ఒక చిన్న తొండంలాగా సాగి ఉంటుంది

వీటన్నిటి చర్మం కింద 'బ్లబ్బర్' అనే క్రొవ్వు పేరుకొని పోయి ఉంటుంది. దాని చర్మం చాల విలువైంది. అందులోనూ "ఫర్‌సీల" అనేదాని చర్మం మరీను. దాని మాంసం తినడానికి బాగా ఉపయోగపడుతుంది అకారణంగా వీటిని మానవుడు విపరీతంగా నాశనం చేసాడు. కాని తరవాత కొన్ని నిబంధనలు పెట్టడం వల్ల తిరిగి వాటి సంఖ్య ఎక్కువయింది.

ఇంకో చిత్రమేమంటే సాగరసింహాలు తెలివైనవి. వాటికి కొన్ని పనుల నేర్పితే చక్కగా నేర్చుకొంటాయి. జంతు ప్రదర్శన శాలల్లోనూ,సర్కసుల్లోనూ వీటిని ఉపయోగిస్తారు. నిచ్చెనలు ఎక్కడం, ఒంటి అడుగు కమ్మిల మీద నడవడం, ముక్కు మీద బంతుల్ని చాలసేపు నిలవగలడం ఇంకా ఇలాటివెన్నో చేస్తాయి. తోకేష్టం లేని పని, చెయి లేని పని అయితే చిత్రంగా తమ అయిష్టతను చూపుతాయి.

ఇక వాటి సాంసారిక జీవితం చూదాం అది చూస్తే మానవుడే ముక్కుమీద వేలు వేసుకోవాలేమో. ఎండాకాలంలో సముద్రం ఒడ్డున ముందు పెద్ద పెద్ద మగవి చేరుకొంటాయి. ముందుగా "తనది" అని ఒక స్థలాన్ని ప్రతి మగది ఆక్రమించుకొంటుంది. మరొకదాన్ని అక్కడికి రానియ్యదు. పాపం చిన్న చిన్న మగజంతువులు చేసేది లేక కలిసి కట్టుగా దూరంగా ఒక మూల పడిఉంటాయి. ఇవి బ్రహ్మచారులన్నమాట. కనీసం ఈ ఏడాదికి. ఇలా ఉండగా కొన్ని వారాల్లో ఆడవి చేరుకొంటాయి. క్రిందటి ఏడాది జరిగిన సంపర్కం వల్ల అవి గర్భిణీలుగా వస్తాయి. మగవాటిలో సంచలనం బయలు దేరుతుంది. ప్రతి మగది వీలైనన్ని ఆడవాటిని, మందని తోలినట్లు, తోలుకొంటుంది. అవసరం వస్తే సముదాయించికూడా లాక్కొంటాయి. ఇదంతా ఒక దాని జనానాఅన్నమాట.ఒక్కొక్క సారి ఈ జనానాలో 75 వరకు ఉంటాయి. అంతగా పోరాడ లేక పోయినవి కొది పాటి ఆడవాటితో 10 15 వరకు సర్దుకొని పోతాయి. తక్కం పారు మగవాటితో నోటితోటి. చేష్టతోటి తగువులాడుతునే ఉంటాయి. పైగా అవకాశం వస్తే ప్రక్కదాని జనానాలోని ఆడవాటిని లాగేసుకొంటుంది కూడా. ఈ విధంగా చేరాక ఆడవని ఒక్కొక్క పిల్లని కంటాయి. [అవి ఈమగరాయుడి పిల్లలుకాదు] త్వరలోనే తన ప్రస్తుత భర్తతో సంపర్కం పొందుతాయి. నెలలతరబడి మగది ఆ స్థలాన్ని వదలకుండా, తిండి తినకుండా కూడా, ఆడవాటిని, పిల్లల్ని కాపలాకాయడమే ధ్యేయంగా పెట్టుకొంటుంది. చలికాలంలో ఇవన్నీ విడిపోయి వలసల పోతాయి. తిరిగి ఎండాకాలం సమయంలో ఇదే కథ. అయితే అప్పటి జనానాలో ఉండేవి, ఇప్పటి జనానాలో ఉండేవి ఒకటిగానే ఉండడానికి అవకాశాలు తక్కువ.

'తప్పకుండా'

'చేతిలో చెయ్యి వెయ్యి'

'శ్రీదేవీ! చెయ్యి వెచ్చగా ఉంది జ్వరం కాదుగదా?'

'జ్వరంలేదు వట్టుబండలూ లేదు. రాయిలావుంటే. మీ ఆవిడ చెయ్యి ఎప్పుడూ చల్లగా ఉంటుందా ఏమిటి? ఎల్లా ఉంటే నాకెందుకులే బాబూ వెళ్ళిరా, మొన్న శంకరమొచ్చాడు.'

'ఎప్పుడు?'

'ఆదివారం. నేనోదో కష్టాలుపడిపోతున్నానని ఒకటే ఏడుపు వెర్రిప్రేమపాపం. అందరూ వన్ను చూసి జాలిపడతారు. నీకేమనిపిస్తుంది బావయ్యా? వర్లే నీ విరహం చూడలేకుండా—వున్నా, ఈసారి వెఱుయుగానిశే నా ప్రశ్నకు సమాధానం. అడిగానని చెప్పు.'

'ఎవరిని?'

'తనని.'

స్వామి తిరిగి వచ్చేసరికి పావనీ—సీతమ్మగారూ మౌనంగా ఏదో ఘోరం జరిగిందర్వాత డస్సిపోయిన ప్రాణుల్లా కూర్చున్నారు. భారతి కనిపించలేదు.

'ఏమిటమ్మా అలా కూర్చున్నారు?'

ఎవరూ మాట్లాడలేదు.

అనుమానం వచ్చింది స్వామికి.

'భారతి ఏది పావనీ.'

'వెళ్ళిపోయింది'— వగిలింది పావని

# మమత

గొంతు.

'ఎక్కడికి—ఏం జరిగిందసలు పావనీ?'

'మొగుడొచ్చి భారతిని గొడ్డును బాదినట్లు బాది, జుట్టుపట్టుకు ఈడ్చుకుంటూ జీపు కారెక్కించుకు లాక్కుపోయాడు. కారు తాళంచేతులు లేవంటే అట్లాకాడ పెట్టి అన్నీ వగలగొట్టి స్టార్టు చేసుకు వెళ్లాడు. అందరినీ నోటికొచ్చినట్టు తిట్టి—'

ఏడ్చింది పావనీ.

ఏ సౌధానికైనా బలాన్నిచ్చేది పునాది. రోజులు మారిపోయాయనీ, జీవితం మారిపోయిందనీ అనుకుంటున్న స్వామి అదృష్ట సౌధానికి బలమైన పునాది లేదు. 'రొష్మ పడిపోతున్నావు నాయనా, నీకేం తక్కువయిందిరా? నిక్షేపంగా చదువుకున్నావు. ఉద్యోగం చేసుకున్నావు, ఎందుకు చెప్పు ఈ లావాదేవీలన్నీ ?' అంటూ హితవు చెపుతూ బాధపడింది సీతమ్మగారు.

మర్నాటి ఉదయం బస్సుమీద జ్ఞానవరం తిరిగి వచ్చిందర్వాతగానీ అసలు విషయం అర్థం కాలేదు. ఆ క్రితం రోజు స్వామి అటు సినిమాకు బయలుదేరిన తర్వాత యిటు దిగారు ఆ రఘుపతిగారూ ఈ కోనేటిరావూ ఊళ్లో. జనరాండ్ర చిత్తాలూ, ప్రభువుల అగ్రహానుగ్రహాలూ ఏ క్షణంలో ఎలా వుంటాయో బ్రహ్మ చెప్పలేడంటారు. స్వరాజ్యమూ, ఎన్నికలూ వచ్చాక ప్రజావాక్యం గూడా ఆ తరగతిలో చేరింది. బ్రహ్మాండమైన మెజారిటీతో గెలిపించిన పెద్దమనిషినే—మళ్లీ ఎన్నికల్లో వగబట్టినట్లు చిత్తుగా ఓడించగల సమర్థత మహాప్రజకుంది. పంచాయతీ ఎన్నికల్లో అంత ఘనంగా గెలిచిన కోనేటిరావుమీద ఆరునెలలు తిరక్కముందే మహాప్రజకు మొహం మొత్తింది.




'ఆ మున్సబూ— మా బావమరదీ— దీనికంతకూ కారణం. పంచాయితీ కాంట్రాక్టుల పేరుతో దోచుకు తింటున్నామని-మా బావమరిదే స్వయంగా డప్పు వాయించి మరీ చెబుతున్నాట్టండీ. ఎంక్వయిరీ పెట్టించమని ఈ వెధవ అంతా పెట్టిన మహాజరులో ఆశుంఠాయిగాడి సంతకం గూడా వుంది మరి. వీడికి పిలిచి మన బిజినెస్‌లో వాటా యిచ్చింది మనకొంప తీయడానికిటండీ?' అంటూ గోలపెట్టాడు కోనేటిరావు.

'చీటీల్లేమిటి— మరోక ఏమిటి— వ్యసనమనేది, ప్రతివెధవనూ ఆత్మబంధువులా కనిపించేటట్లు చేస్తుంది గదండీ. మనకు యిలా వెన్నుపోటు పొడిపించాలనే మీ బావమరదిని దువ్వి — అన్ని విద్యలూ నేర్పి, పెంపుడు కుక్కగా మార్చి, మన మీద ఉసిగొలిపాడు చివరకు. అయినా ఆతగాడిమీద—ఎంతయినా చెల్లెలిమొగుడు గదా—నువ్వలా చెయ్యి చేసుకోడం బాగుండలా—' అన్నారు రఘుపతిగారు.

'చెల్లెలి మొగుడు గనకనే అంతటితో వదిలిపెట్టా. లేకపోతే చెక్కేవాణ్ణి బాదినతో వెధవను'

'చెక్కుడుగానికానీ క్రిమినల్ కేసు విషయం ఆలోచించు'

'మనమే ముందు తగిలిద్దాం ఆ మున్సబ్బునూ వీణ్ణి కలిపి'

సాక్ష్యం కావాలిగదా?'

'మీరున్నారు. మా ష్టాఫున్నారు. ఒంటెద్దుబండి వెంకన్న—రామిగాడూ—చాలరంటారా? తగిలించండి. అంతు తేల్చుకుందాం'

జెల్లంకొట్టినతాయిలా కూర్చొని ఈ మాటలన్నీ వింటున్న స్వామికి విషయం తలకెక్కుతున్నకొద్దీ రక్తపుపోటు వచ్చి

వెళ్ళింది. ముందు పోలీసురిపోర్టు యివ్వాలనుకుంటూ ఒంటెద్దుబండిలో వాళ్ళు హడావుడిగా తరలిపోయారు. మరొక అరగంటకు భీమారావు వచ్చాడు 'పంతులూ' అంటూ కేకపెడుతూ. ఇంత గొడవ జరిగి కొడుకు వెళ్ళిపోయింతర్వాత సీతమ్మగారికి గుండెదడ హెచ్చింది. ప్రాణం ఉండబట్టక 'ఏం అఘాయిత్యం జరుగుతుందో యింకా' అనుకుంటూ తర్వాతి బస్సులో, ఆమెకూడా బయలుదేరి జ్ఞానవరం వచ్చింది. నూజివీడు వచ్చి, భారతిని హింసించి తీసుకుపోయిన భీమారావు బావగారిమీద కక్షగట్టి కత్తులు నూరుతూ, ఏదో గుబులు వచ్చినట్లయి, ఒక్కసారిగా లేచి—రఘుపతిగారింటికి వచ్చాడు.

'పంతులూ?' — ఎంత దౌర్జన్యం కేకలో.

బయటకొచ్చాడు స్వామి. పావని కిటికీ రెక్కదగ్గర నిలబడింది ఎగిరిపడుతున్న గుండెలను అదిమిపట్టుకుంటూ.

'ఏమిటండీ?' అన్నాడు బెరుకు బెరుకుగా.

ఏం చూసుకుని అంత తలతిరుగుడు నీకు?'

'ఏమిటండీ మీరనేది?'

'నడుం విరగతంతే అప్పుడు తెలుస్తుంది ఏమంటున్నదీ?'

'మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు భీమారావుగారూ'

'నోర్ముయ్! చవటరాస్కెల్. నీ పెళ్ళాన్ని ఎవడన్నా సినిమా అంటూ లాక్కెడితే యెలా వుంటుందిరా? నువ్వు ఆడుతున్న నాటకం నాకు తెలీదంటావా? మామీదనే పోలీసుకేసు పెట్టిస్తున్నారట. నీ బోడిసాక్ష్యంతప్ప—ఊళ్ళో ఎవరూ దిక్కులేకపోయారు ఆ వెధవలకు చస్తావు పిరికిసన్నాసీ జాగ్రత్త.'

భీమారావు ఏం తిడుతున్నాడో—స్వామికి అర్థం కావడంలేదు. పరిస్థితి విషమించిందనిమాత్రం అర్థం చేసుకున్నాడు.

'నాలుగడబ్బులు చేతికందగానే కళ్ళు బయర్లు కమ్మాయిరా? కాగుడింతం చెప్పుకుంటూ బ్రతకవలసిన కుంకవి. నీకెందుకురా అంతపొగరు?'

చొక్కాపుచ్చుకు గుంజాడు భీమారావు, గుండెలు బాదుకుంటూ సీతమ్మగారు రెండుచేతులూ జోడించి ఉగ్రరూపంతో ఊగుతున్న భీమారావుకు నమస్కరించి, విడిపించింది. 'అయ్యా! నా మాట నమ్మండి. మీ గొడవలు నా కవసరంలేదు. మీ రాజకీయాలు అవసరం లేదు. ఈ కాంట్రాక్టులూ క్రిమినలుకేసులూ అంతకంటె అవసరం లేదు. సాధ్యమైనంత త్వరలో మీ కంటికి కనిపించకుండా పోతాను. నన్ను క్షమించండి' అంటూ చొక్కా విడిపించుకొని లోపలికిపోయి ముసుగు పెట్టుకు పడుకున్నాడు స్వామి. అశక్తితో ఆత్మహత్య చేసుకుంటున్న ఆవేశంతో ప్రాణవాయువులను బయటకు తోడుతున్న అవమానంతో నీరసించి విరిగింది అతని మనస్సు.

ఆ పూట యింట్లో ఎవరికీ భోజనాలు లేవు.

మధ్యాహ్నానికి 'డి. యస్. పి. వచ్చాడు' బయలుదేరు అంటూ చెమటలు కక్కుకుంటూ రఘుపతిగారు వచ్చి స్వామి కప్పుకున్నదుప్పటి యివతలకు లాగాడు. 'ఎందుకొచ్చావు నాయనా ఈ దిక్కుమాలిన ఊరు మరొకటి దొరక్క పోయిందా?' అనుకుంటూ రోదించింది సీతమ్మగారి మనస్సు.

'నేను రాలేనండీ' అంటూ లేచి కూర్చున్నాడు లేని వోపికతో.

'కొంప మునుగుతుందయ్యా'

'నేనేం చేయగలను?'

ముందు భీమారావే మున్సబుసాయంతో దొమ్మీకి వచ్చి మన కోనేటిరావును కొట్టినట్లు సాక్ష్యం చెప్పాలి'

వంటినిండా కట్లు కట్టుకున్న కోనేటిరావు కనిపించాడు బయట.

'నేను చెప్పలేనండీ అబద్ధం! అసలు నాకెందుకీ గొడవలు?'

'మమ్మల్నిలా ముంచుతావన్న మాట? చెప్పవన్నమాట సాక్ష్యం?' ఆపద వచ్చినపుడు ధర్మరాజంతటివాడు చెప్పాడయ్యా అబద్ధం—నాకు చెప్పకే నీతులు'.

'చెప్పను'

'సరే చూద్దాం'

విసురుగా బయటకు నడిచారు రఘుపతిగారు

(ఇంకా ఉంది)

అన్నానికి బదులు

## బియ్యంపిండి రొట్టెలు

**ఒకశేరు బియ్యంపిండి (ఎక్కువ నూకలుంటే వాటినే మెత్తని పిండిగా మరపట్టించుకోవచ్చు) తగినంత ఉప్పు, ఉడుకు నీళ్లు.**

వెడల్పుపాటి పళ్లెంలోకి బియ్యప్పిండి జల్లించుకుని తగినంత ఉప్పు వేయాలి. మరుగుతున్న నీళ్లు పిండిలో కొంచెం కొంచెంగాపోసి పిండి కలియపెట్టాలి. పిండి తడిపొడిగా ఉండలు కడుతుంది. ఈ పిండి బాగా చల్లారేదాకా అట్టేపెట్టి తరువాత మదాయించుకొని ఒక రొట్టెకి సరిపోయే ఉండలు చేసుకోవాలి. రొట్టెలపీటమీద పొడి పిండితో ఈ పిండి రొట్టెలుగా వత్తుకోవాలి.

పెనం కాలేసి, మరీ ఎర్రగా కాలనియ్యకుండా రొట్టెలు కాల్చాలి ఒకవక్క కొంచెం వేగినట్టు కాగానే రొట్టెతిప్పి, అట్లకాడతో నొక్కుతూ రెండోవేపు కాలనిస్తే రొట్టె పొంగుతుంది. ఈ రొట్టెలు చపాతీల్లాగా అన్నానికి బదులు వడ్డించుకోవచ్చు—పెరుగు పచ్చళ్లు, పులుసుకూరలు, తియ్యపులుసులు వీటికి ఆధరవులుగా చేస్తే బాగుంటుంది.

—కె. ఆర్.

# లవ్ లెటర్

బొమ్మలకథ
సీరియల్
-8-
శంకు
























# ముగ్గురు మూర్ఖులు (38)

# అగ్గిపుల్లా — సబ్బుబిళ్ళా!



'అంత దీక్షగా చూస్తున్నావు దేన్ని?' అని ప్రశ్నించాడు చూడామణి.

'అగ్గిపుల్లను' అని సమాధానం యిచ్చాడు చంద్రరావు.

'ఏమిటి విశేషం?'

'శ్రీ శ్రీ వ్రాసిన మహాప్రస్థానంలో ఋక్కులు అనే గేయం ఉంది అందులో

కుక్కపిల్లా
అగ్గిపుల్లా
సబ్బుబిళ్లా
హీనంగా చూడకు దేన్నీ!
కవితా మయమేనోయ్ అన్నీ!

అని ఉంది' అని అంటూ చంద్రరావు చెప్పడం ప్రారంభించాడు.

'వీటిని గురించి కవిత్వం చెప్పడం యెలాగ? అని ఆలోచిస్తున్నాను.'

'కుక్కపిల్లని—ముఖ్యం తల్లి చచ్చిన దిక్కులేని గజ్జికుక్కపిల్లని పెంచ మంటాను' అని చెలం యోగ్యతా పత్రంలో చెప్పాడు.

'కుక్కపిల్ల ప్రాణి కాబట్టి దానికష్ట సుఖాలను గురించో, మంచి చెడ్డలను గురించో కవిత్వం చెప్పవచ్చును.'

మిగిలిన అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ కేవలం వస్తువులు, వాటికి చరిత్ర యేమీ ఉండదు. అందుచేత వాటిని గురించి కవిత్వం యేమిటి వస్తుంది? అని అనుకొన్నాను.

'అగ్గిపుల్ల వంక—ముఖ్యం పుచ్చిన అగ్గిపుల్ల వంక చాలాసేపు చూడమంటాను' అని చెలం అన్నాడు. అందుచేత అగ్గిపుల్ల వంక దీక్షగా చాలా సేపనుంచి చూస్తున్నాను కాని కవిత్వం యేమీ రావడంలేదు' అని చంద్రరావు తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

'కవితా మయమేనోయ్ అన్నీ' అని అన్నంత మాత్రాన వాటిమీదనే కవిత్వం రావలసిన అవసరం యేమీ లేదు. అగ్గిపుల్లను, సబ్బుబిళ్లను ఉపమానాలుగా వాడుకొని ఒక వాక్యాన్ని చెప్పవచ్చును.' అన్నాడు చూడామణి.

'అది యెలాగ?'

'అగ్గిపుల్ల లాంటి స్త్రీ అయినా సరే సినిమాల్లో చేరితే సబ్బుబిళ్ళలాగ తయారు అవుతుందని చెప్పవచ్చును గదా!

ఇంతకూ ఒక వస్తువు యొక్క బాగోగులుగాని ఒక సంఘటన యొక్క మంచి చెడ్డలుగాని వాటిని గురించి చెప్పేవాడి సామర్థ్యం మీద ఆధారపడి ఉంటాయికాని అసలు వస్తువు మీదగాని, సంఘటనమీదగాని యెంత మాత్రం ఆధారపడి ఉండవు. ఇలాగే తన గడియారాల్లో ఉండే తేడాలను గురించి అప్పారావు చెప్పాడుకదా!' అన్నాడు చూడామణి.

'అప్పారావు యేమిటి చెప్పాడు?' అని ప్రశ్నించాడు చంద్రరావు.

'అప్పారావుకు ఒక కిళ్లీ కొట్టు ఉండేది. ఆ కొట్లో రెండు గడియారాలు ఉండేయి. ఆ రెండు గడియారాలూ యెప్పుడూ రెండు వేళ్ళు చూపిస్తూ

జేయి. ఒకవాడు ఆ కొట్టు వద్దకు వచ్చిన ఒక ఆసామీ 'రెండు గడియారాలూ. రెండు టైములు, చూపిస్తున్నాయి. యేమిటి?' అని ప్రశ్నించాడు.

'బాబూ! ఒకే టైమును చూపించడానికి అయితే రెండు గడియారాలు యెందుకు?'

అని అప్పారావు ఆ ఆసామీని తిరిగి ప్రశ్నించాడు. దానికి ఆ ఆసామీ యేమీ సమాధానం యివ్వలేక పోయాడు.

'అలాగ ఉన్న దున్నట్టుగా చెప్పడానికే అయితే యిన్ని చదువులు యెందుకు? ఏమి జరిగినా సరే, దాన్ని తనకు అనుకూలంగా మార్చి చెప్పుకోవడానికేగదా యిన్ని పుస్తకాలు చదవడమూ' యిన్నిదేశాలు తిరిగి అనుభవం సంపాదించడమూను. ఇటువంటి నేర్పువల్లనే గదా ఒక లాయరు !తన తరఫు పార్టీ చేసిన పొరబాటును, తనకు అనుకూలంగా మార్చ గల్గాడు' అన్నాడు చూడామణి.

ఏమిటి ఆ లాయరు నేర్పు? అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక లాయరు, ముద్దాయి అయిన ఒక ముసలమ్మ తరఫున వాదించవలసి వచ్చింది. కేసు వాయిదా నాటికి ముందు రోజున ఆ ముసలమ్మ లాయరు వద్దకు వచ్చింది.

'చూడు, అవ్వా! రేపటిరోజున కోర్టులో నేను జేబురుమాలు పైకి తీసినప్పుడల్లా నువ్వు గట్టిగా యేడు. తరువాత విషయం నేను చూసికొంటాను' అని లాయరు ముసలమ్మకు సలహా యిచ్చాడు.

'మర్నాడు లాయరు మామూలుగా కోర్టుకు వెళ్లాడు. ముందురోజు రాత్రి బాగా జలుబు చేయడంవలన లాయరు కోర్టులో మాటిమాటికి జేబురుమాలు తీసి ముక్కు తుడుచుకొనడం ప్రారంభించాడు. కోర్టు అడావడిలో లాయరు తాను ముసలమ్మకు యిచ్చిన సలహాను మర్చిపోయాడు గాని ముసలమ్మకు మాత్రం ఆ సలహా బాగా గుర్తు ఉంది. అందుచేత ఆమె లాయరు జేబురుమాలు పైకి తీసినప్పుడల్లా గొల్లున యేడవడం ప్రారంభించింది.

మంగ:రుమహాఖులు

మేజిస్ట్రేటు ముసలమ్మను చూశాడు. ముసలమ్మ యెందుకు యేడుస్తున్నదీ, అతనికి తెలియలేదు. అందుచేత మేజిస్ట్రేటు 'ఎందుకు యేడుస్తున్నావు?' అని ముసలమ్మను ప్రశ్నించాడు.

'కోర్టులో తాను జేబురుమాలు పైకి తీసినప్పుడల్లా యేడవమని వకీలు బాబు చెప్పాడు' అని ముసలమ్మ సమాధానం యిచ్చింది.

'అలాగ చెప్పినమాట నిజమేనా?' అని మేజిస్ట్రేటు లాయరును ప్రశ్నించాడు.

ముసలమ్మ నిజం చెప్పివేయడంవలన లాయరు మొదట కొంచెంసేపు కంగారు పడ్డాడుగాని వెంటనే సర్దుకొని యిలాగ సమాధానం యిచ్చాడు.

'నేను అలాగ చెప్పినమాట నిజమే అనుకోండి. అయినా ఆ సంగతి తమతో చెప్పవచ్చునా? ఇలాగ నిజం చెప్పి వేయడం తనకు వ్యతిరేకం కాగలదని చిన్నపిల్లలకు కూడా తెలుస్తుంది. అయినా యిటువంటి అతి సామాన్యమైన విషయం కూడా యీ ముసలమ్మకు తెలి లేదు, అంటే యీ ముసలమ్మ యెంతటి అమాయకురాలో మనం ఊహించవచ్చును. ఈ పరిస్థితిలో యింతటి అమాయకురాలైన ముద్దాయి అంతటి నేరం చెయ్యగలదని మనం ఊహించడానికైనా అవకాశం ఉంటుందా?' అంటూ లాయరు ముసలమ్మ

నువ్వు సినిమాల్లో
జేరక ముందు అగ్గి
పుల్ల!! మరిప్పుడో...
..... హి హి హి!!




చేసిన పొరపాటును తనకు అనుకూలంగా మార్చి చెప్పాడు.

'అందుచేత యితరులు చేసిన దానిని గాని తాను చేసినదానిని గాని ఉన్నదున్నట్లుగా చెప్పడం సామాన్యుల లక్షణం'

'ఇతరులు చేసిన దానినిగాని, తాము చేసిన దానిని గాని తన వాదానికి అనుకూలంగా మార్చి చెప్పడం మేధావుల లక్షణం.'

'ఇతరులు చేసినదంతా ప్రజాస్వామ్య వ్యతిరేకమనీ, అభ్యుదయ నిరోధకమనీ, తాను చేసినది మాత్రం ప్రజాస్వామ్యమనీ, అభ్యుదయమనీ చెప్పడం రాజకీయ నాయకుల లక్షణం.

'ఉదాహరణకు భారత ప్రధాన మంత్రిణి అయిన యిందిరాగాంధి విషయమే తీసికో. దేశం నానాటికి అధోగతి పాలయిపోతున్నా, కేవలం యీ మాటలు చెప్పే నేర్పువల్లనే ఆమె అధికారంలో ఉండగల్గుతున్నది.' అన్నాడు చూడామణి.

'సరే, ఎప్పుడో జరిగిపోయినదానిని గురించి యిప్పుడు చర్చ యెందుకు? కాంగ్రెసులో చీలికలు బాగా యేర్పడిన తరువాత ఇందిరాగాంధి ఆర్థికమంత్రి అయిన మొరార్జీదేశాయిని తొలగించి, బ్యాంకుల్ని జాతీయం చేసింది కాదా? ఇది అభ్యుదయకరమైన చర్య కాదా?' అని చంద్రావు ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'బ్యాంకులను జాతీయం చెయ్యడం అభ్యుదయకరమైన చర్య అవునా? కాదా? అనే విషయాన్ని గురించి నేను యిక్కడ చర్చించడం లేదు. దానిని గురించి మరొకసారి చెబుతాను. బ్యాంకులను జాతీయం చెయ్యడం అభ్యుదయకరమైన చర్యయేనని వాదంకోసం ప్రస్తుతానికి అంగీకరిద్దాం!

'అప్పటికి ఆర్థికమంత్రి అయిన మొరార్జీదేశాయిని పదవినుంచి తొలగించి ఇందిరాగాంధి బ్యాంకులనుజాతీయంచేసింది. అందుచేత యిందిరాగాంధి బ్యాంకులను జాతీయం చేయడానికి మొరార్జీదేశాయిని తొలగించిందా? లేక మొరార్జీదేశాయిని తొలగించడానికి బ్యాంకులను జాతీయం చేసిందా? అనే ప్రశ్నలను గురించి ఆలోచించవలసి ఉంది.

'1969వ సంవత్సరం జూలైనెలలో

జరిగిన సంఘటనలను వరుసగా పరిశీలిస్తే యీ ప్రశ్నలకు సమాధానం మనకు లభిస్తుంది.'

జూలై 10 ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ బెంగుళూరు కాంగ్రెసు మహాసభలకు ఆర్థిక విధానాలను గురించి ఒక నోటు పంపింది. 'అయిదారు పెద్ద బ్యాంకులను జాతీయం చెయ్యడంగాని లేక బ్యాంకులలో లభించే ధనంలో హెచ్చు భాగాన్ని ప్రజల ఉపయోగం నిమిత్తం కేటాయించేలాగున నిర్దేశించాలని గాని' ఆ నోటులో ఉంది. అంతేగాని బ్యాంకులను వెంటనే జాతీయం చేసి తీరాలని ఆ నోటులో యెక్కడా లేదు.

జూలై 11 బెంగుళూరు కాంగ్రెసు కార్యవర్గ సమావేశానికి ఇందిరాగాంధీ కూడా హాజరు అయింది. ఆమె పంపిన నోటును ఆధారంగా చేసికొని ఆర్థిక విధానానికి సంబంధించిన తీర్మానాన్ని కాంగ్రెసు కార్యవర్గం యేకగ్రీవంగా ఆమోదించింది. ఈ తీర్మానంలో కూడా వెంటనే బ్యాంకులను జాతీయం చేసి వేయాలని యేమీ లేదు.

జూలై 12 – ఇందిరాగాంధీ ప్రతిపాదనకు వ్యతిరేకంగా కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు నీలం సంజీవరెడ్డిని అధ్యక్షపదవికి అభ్యర్థిగా నిర్ణయించింది. మొరార్జీదేశాయి నీలం సంజీవరెడ్డిని బలపరచాడు అంటే ఇందిరాగాంధీని వ్యతిరేకించాడు.

జూలై 16–ప్రధానమంత్రిణి ఇందిరాగాంధీ మొరార్జీదేశాయి వద్దనుంచి ఆర్థికశాఖను తీసివేసింది. మొరార్జీదేశాయి రాజీనామా చేశాడు.

జూలై 17,18 మొరార్జీదేశాయికి ఆర్థికశాఖను తిరిగి యిప్పించడానికి చవాన్, నిజలింగప్ప ప్రయత్నం చేశారు కాని వారి ప్రయత్నాలతో యిందిరాగాంధీ సహకరించలేదు.

జూలై 19 –ఇందిరాగాంధీ బ్యాంకులను జాతీయం చేసింది. మొరార్జీదేశాయి రాజీనామాను ఆమోదించింది.

ఇందిరాగాంధీ జూలై 11 వ తేదీని కూడా బ్యాంకులను వెంటనే జాతీయం చేసి వేయాలని అనుకోలేదు. అయినా జూలై 19వ తేదీని బ్యాంకులను






జాతీయం చేసి వేసింది. దినికి కారణం యేమిటి?

అధ్యక్షపదవికి అభ్యర్థిని నిర్ణయించడంలో ఆర్థికమంత్రి అయిన శ్రీ మొరార్జీదేశాయి ఇందిరాగాంధిని వ్యతిరేకించాడు. అందుచేత మొరార్జీదేశాయిని పదవినుంచి తొలగించవలసిన అవసరం ఆమెకు జూలై 12 వ తేదీని కలిగింది కాబట్టి ఆమె మొరార్జీదేశాయిని పదవినుంచి తొలగించింది. అయితే తాను తీసికొన్న యీ చర్యను పార్టీ బలపరచక పోవచ్చుననే ఉద్దేశంతో ఆమె తన చర్యకు ఒక అభ్యుదయపు ముసుగును తొడిగింది. అదే బ్యాంకులను జాతీయం చెయ్యడం.

ఈ సంఘటనలను పరిశీలిస్తే ఇందిరాగాంధి మొరార్జీదేశాయిని అధికారంలోనుంచి తొలగించడానికి బ్యాంకులను జాతీయం చేసింది కాని బ్యాంకులను జాతీయం చెయ్యడానికిగాను మొరార్జీదేశాయిని తొలగించ లేదు.

'అందుచేత బ్యాంకులను జాతీయం చెయ్యడంలో ఇందిరాగాంధి యొక్క లక్ష్యం మొరార్జీదేశాయి మీద పగ తీర్చుకోవడమే గాని ఆమె పైకి చెబుతుండే సోషలిజం యెంతమాత్రం కాదు. కాబట్టి బ్యాంకులను జాతీయం చేసినందుకు యెవరినయినా అభినందించదలుచుకొంటే మీరు మొరార్జీదేశాయినే అభినందించాలి గాని ఇందిరాగాంధిని యెంత మాత్రం కాదు.'

'అధ్యక్ష పదవికి అభ్యర్థిని నిర్ణయించడంలో మొరార్జీదేశాయి ఇందిరాగాంధి ప్రతిపాదనకు అనుకూలంగా వోటు చేశాడనుకొందాం. అప్పుడు ఇందిరాగాంధి మొరార్జీదేశాయిని పదవి నుంచి తొలగిస్తుందా? బ్యాంకులను జాతీయం చేస్తుందా?' అని ప్రశ్నించాడు చూడామణి.

'ఇప్పటికే ఆలస్యం అయింది' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●







# ఎవరి కీర్తి స్థిరమైనది? ధర్మపథం

బులుసు వెంకట రమణయ్య

ఎవరి కీర్తి స్థిరంగా వుంటుంది? కవిదా? పండితునిదా? అనే చిక్కు ప్రశ్న చాలామంది మనస్సుకు తట్టి వుంటుంది.

పండితుడు భాషా వాఙ్మయాలలో చక్కని జ్ఞానం కలిగించి, కవికి లక్షణజ్ఞానమునూ, ఇతరులకు కవిత్వ రసగ్రహణశక్తిని కలిగిస్తాడు. కవి తన సహజసిద్ధమైన రసవత్కవితా ధారమూలంగా జనాన్ని రంజింపజేస్తాడు. వీరిద్దరికీ కలిగే కీర్తి అసాధారణమైనదే!

కాని, కొంత భేదం కానవస్తుంది.

విద్వాంసుడు శిష్యుడికి విద్యాబోధచేసి కీర్తి సంపాదిస్తాడు. ఆ శిష్యుడు, తాను విద్వాంసుడయాక తన శిష్యుడికి — తన విద్యాభ్యాసాన్ని గురించీ, తన గురువుల ప్రాభవాన్ని గురించీ వివరంగా తెలియచేస్తాడు. ఈ విధంగా పండితుని కీర్తి, తన శిష్య ప్రశిష్యుల వల్లా, వారి శిష్య ప్రశిష్యులవల్లా కొంతకాలం నిలుస్తుంది. తర్వాత క్రమంగా విస్మృతిపథంలో పడిపోతుంది.

కవి వాగ్రూపంగా కవిత్వం చెప్పినా, అది లిఖిత రూపాన్ని పొందుతుంది. కావ్యాలను కృతి పొందే మహారాజులూ, భూస్వాములూ, అప్తులూ దాన్ని భద్రంగా కాపాడుకొంటారు. కవి కూడా ఆప్యాయంగా భద్రపరచుకుంటాడు. రసవంతమైన కావ్యానికి, ఉపయుక్తమైన గ్రంథానికీ ఆసక్తి వున్న వారూ, భాషాభిమానులూ ప్రతులు వ్రాసుకుంటారు. అవి వుండబట్టే ఎన్నో శతాబ్దాల క్రిందట రచించబడిన గ్రంథాలు ఇప్పటికీ ప్రత్యంతరాలమూలాన ఇప్పుడు ముద్రణమూలాన మనకు లభ్యమవుతున్నవి. పూర్వపు మహాకవుల పేర్లు మనకు తెలుసును. కాని, అప్పటి మహాపండితుల (గ్రంథకర్తలు కాని వారి) పేర్లు తెలియవు. ఎంతటి మహాపండితుడయినా — గ్రంథకర్త కాకపోతే అతని కీర్తికి స్థిరత్వం ఉండే ఒట్లు లేదు. పాండిత్యం లేకపోయినా కవిత్వం చెప్పేవారి పేరు స్థిరంగా ఉంటుంది.

తగిన పాండిత్యం లేని ఒక కవి ఒక పట్నంలో — జీవనోపాధికోసం ఒక పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పని చెయ్యవలసివచ్చింది. ఆ ఉద్యోగం కొన్నాళ్ళు సాగింది. అది స్థిరపడాలంటే—ఆ పదవికి నిర్ణయించబడిన పరీక్ష పాసు కావాలి! ఆయన పరీక్షకు వ్రాశాడు కాని, శాస్త్ర గ్రంథాలకు సంబంధించిన ప్రశ్నలకు తగిన సమాధానాలు వ్రాయలేకపోయాడు. గుండెల్లో రాయి పడింది. పరీక్ష తప్పితే ఉద్యోగం ఊడిపోతుంది. పరీక్షకుడు అయిన మహాపండితుడి కాళ్ళమీద పడి — రక్షించాలని కోరితే ఆయన స్వభావం ఎటువంటిదో? కోపం వచ్చి పూర్ణానుస్వారం పెడతాడేమో!

యుక్తిపరుడైన ఆ కవి—ఆ విద్వాంసునితో ఎక్కువ పరిచయంగల ఆప్తుడికి ఈ విషయం చెప్పి, తన్ను గట్టెక్కించాలని కోరాడు. అతడు పరీక్షకుని వద్దకు వెళ్లి — మెల్లగా పరిస్థితులను తెలియజేశాడు.

కఠినుడనే పేరుపొందినా — నవనీతహృదయం గల ఆ పరీక్షకుడు నవ్వుతూ "అయ్యా! విద్వాంసుడు బ్రతికివున్నా చచ్చినవాడిలోనే లెక్క. అతనికి జనసామాన్యంలో గౌరవం లేదు. కవి—చచ్చిపోయినా — అతని రచనలవల్ల బ్రతికేవుంటాడు. పాండిత్యం పనిలేదు చచ్చిపోయినా బ్రతికివుండే కవి—జీవించివున్నప్పుడు — అతన్ని చంపితే మహాపాపం! అతన్ని హాయిగా బ్రతకనివ్వండి! నేను అతనికి ఉపకారమే చేస్తాను కాని, ఎంతమాత్రం అపకారం చెయ్యను" అని అన్నాడట!

ఆ కవి పరీక్షలోనూ జీవితంలోనూ కృతార్థుడే!

# అవి బాటా శాండక్స్ అని ఖచ్చితంగా తెల్సుకోండి



## శాంతా

బ్లూ, బీజ్ & పింక్
సైజులు 2—6
రూ॥ 8.95

## లీలా

గ్రే, బీజ్ & పింక్
సైజులు 2—6
రూ॥ 8.95

కెమిలాన్‌తో చేసిన జోళ్లు. ఎంతో తీరుగా, అందంగా తయారు చేసినవి. రోజల్లా తొడుకున్నా సరే పాదాలు చెక్కుచెదరకుండా వుంటాయి. చాలా కాలం క్రొత్త వాటిలా వుంటాయి. మీకు శ్రమే వుండదు. జోళ్లు తుడుచేసి తొడుక్కోండి.

**Bata**
**శాండక్***
కెమిలాన్*

*రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కులు
లెక్కగా కొంత మంది ఉత్పత్తిదారులే బాటా నమూనాల ప్రకారం ఖచ్చితంగా చేస్తున్నారు.



# స్మృతి చిహ్నాలా – చాదస్తాలా?





ఏదో జ్ఞాపకార్థమయి ఏదో వస్తువుని ఎందరో దాస్తూ ఉంటారు. ఇవి ఎన్నో రకాలు. కొన్ని తమాషాగా ఉండేవి, కొన్ని భయంకరమయినవి . . .

■ పోయిన ప్రపంచ యుద్ధం జ్ఞాపకార్థం బ్రిటీషు విమానదళంవారు తమ లిటిల్ రిసింగ్టన్ తరిఫీదు కేంద్రంలో ఒక వస్తువు భద్రంగా దాచిపెట్టారు. అది అడాల్ఫ్ హిట్లర్ వాడిన కమోడు మీద చెక్కభాగం.

దానిని 1945 సెప్టెంబరులో ఎయిర్ వయిస్ మార్షల్ రిచర్డ్ హారిసన్ బెర్లిన్ మంచి తీసుకు వచ్చినట్లు ఒక ఫలకం మీద రాసి ఉంటుంది ...

■ స్మృతి చిహ్నం వెర్రి పెద్దదే. ఒక సైనికుడు హేండ్ గ్రెనేడ్‌ని భార్యకి ఇవ్వగా ఆమె దానిని 50 సంవత్సరాలుగా దాచింది. అది ఎన్నోసార్లు కింద పడింది కూడా; కాని పేలలేదు! చివరికి ఒక కొళాయిలు మరమ్మత్తు చేసే అతను దాని ప్రమాదం గుర్తించి సైన్యం వారికి టెలిఫోను చేసి దానిని తొలగింపచేశాడు!

యుద్ధం అయిన తర్వాత తాపీ సామగ్రి బాగా దొరికేది కాదు. అందుచేత ఒక ఇటాలియన్ కార్మికుడు దొరికిన సామానుతో ఒక 'గుడిసె' కట్టాడు. ఈ సామానులో పేలని గుళ్ళుకూడా ఉన్నాయిట! దీనిని తెలుసుకున్న తర్వాత అధికారులు, అతి జాగ్రత్తగా, ఆ గుడిసెని ఏ భాగానికి ఆ భాగాన్ని ఊడ తీశారు...

ఇటలీలో మాత్రం ఒకప్పుడు ఉన్న 'క్రయిస్తుని బంధించిన శిలువ' భాగాలతో కొన్ని పెద్ద నావలని కట్టవచ్చునని అంచనా. ఇక నేటి చెయినాలో మావో స్విమ్మింగ్ నడచిన భూభాగం మట్టి ముద్దలతో ఒక పర్వతాన్ని లేవతీయవచ్చునేమో! ఈ ముద్దలని కొన్ని వేలమంది చెయినాదేశ ప్రజలు పేర్చుకుంటూ వచ్చారుట. మట్టి ముద్దలతోబాటు రాళ్ళు కూడా పోగుచేస్తూ ఉంటారుట వీరు...

ఒకసారి ఒక ఇటాలియన్ ధనవంతుడు తన పెళ్ళాంమీద కోపంవచ్చి మొహంమీద ఒక దెబ్బ వేశాడుట. అది ఆమె నోటి మీద తగిలి ఒక పన్ను ఊడిందిట. భార్య వదిలి వెళ్ళిపోయిందిట. కాని భర్త మాత్రం ఆ పంటిని భద్రపరిచాడుట. అది కాస్తా ఒకసారి తప్పిపోగా దానికోసం అతను సుమారు 4000 రూపాయల బహుమతి ప్రకటించాడుట!

జార్జ్ లవోకాట్ ఒక ఫ్రెంచివాడు. అతను పెళ్లి చేసుకుంటూ ఉండగా, సరిగ్గా ముహూర్త సమయానికి పెళ్లికూతురు అతన్ని నిరాకరించింది. నిరాకరించినా కన్నీరు పెట్టుకుంది. పెళ్లికొడుకు ఆమె కన్నీటిని తుడిచాడు. గుడి

నాలుగు వేలు
బహుమతా?
పోగొట్టుకున్నది
ఏదైనా గొప్ప
వస్తువా!!






చిన రుమాలని 20 సంవత్సరాలు దాచి పెట్టాడు. అది ఒకనాడు పోయింది. దానికోసం పెళ్ళికొడుకు సుమారు రు. 36000 ఇస్తానన్నాడట......

ఇంగ్లాండులోని బర్మింగ్‌హామ్ నగరంలో ఒకాయన తన కాబోయే భార్యని పెళ్లి చేసుకోమని అడిగినచోట ఉన్న నాపరాయిని ఆ నగర పురపాలక సంఘం దగ్గర కొన్నాడుట. దానిని తన భోజనాల గదిలో పదిల పరిచాడుట!

కొందరికి భయంకరమయిన వస్తువులని కొనటం అలవాటు. లూయిసా కార్మిన్‌సిటా ఒక అమెరికన్ వనిత. బలవంతంగా చనిపోయిన వారి మరణానికి కారణాలయిన వాటిని ఆమె కొనేది. ఒక చోట ఒకతనిని కొందరు దుండగీలు ఉరి వేయగా ఆ తాడుని సుమారు 1000 పవనుకి (నేడు రు. 18000)కొన్నది. ఆస్టిన్ అనే ఊరి వద్ద ఒక కారు దీపపు స్తంభానికి ఢీ కొనగా ఆ చోటికి ప్రత్యేకమయిన విమానంలో వెళ్ళింది — ముక్కలయిన కారుని కొనటానికి! అలాగే న్యూయార్క్‌లో ఒక వనిత నీటి తొట్టిలో స్నానం చేస్తూ ఉండగా షాక్‌కొట్టి పోయింది. లూయిసా ఆ తొట్టిని కొన్నది...

ఆమె చనిపోయినప్పుడు ఆమె వద్ద ఇటువంటి 'జ్ఞాపకార్థం' సామగ్రి 16000 ఉన్నాయిట! వీటిలో ఏడింటిని మాత్రమే అమ్మటానికి వీలయింది. తక్కినవాటిని ఆస్తి వ్యవహారాలని చూసుకునే వారు ఒక పెద్ద పడవలో సముద్రంలోకి తీసుకుపోయి పారవేశారుట.

పాశ్చాత్య దేశాలలో గొప్ప పాటగాళ్ళని (అంటే జానపద సంగీత విద్వాంసులని) చుట్టుముట్టే యువజనం వారి దుస్తులలో ముక్కలని చించి దాచుకోవటం కద్దు. ఒక సంగీత విద్వాంసుడి పబ్లిసిటీ ఏజెంటు తయారు చేసిన సూటు లాగగానే ముక్కలు ముక్కలుగా పడిపోయింది...

దొంగతనం అంటే ఎరగనివారు విదేశాలకి (ఒకప్పుడు స్వదేశంలోనే!) విలాస యాత్రలమీద వెళ్ళినప్పుడు తువ్వాలలు, గ్లాసులు, చెంచాలు, కొట్లు తగిలించే తీగలు మొదలయినవి తీసుకు వచ్చేస్తూ ఉంటారు. (1965 లో కొందరు అమెరికన్లు కలిసి పారిస్‌లో 'ఏష్‌ట్రేల దొంగతనాన్ని ప్రోత్సహించే అంతర్జాతీయ సంఘా'న్ని నెలకొల్పారుట. పొగ తాగటం వీరికి ఇష్టమో కాదో తెలియదు...)

(గ్రీన్‌వద్స్ రోడ్స్ ద్వీపంమీద ఒక పెద్ద హోటలులో ఏటా 1200 పవన్ల (సుమారు 21600 రూపాయల) విలువ సామగ్రిని కాతాదార్లు తీసుకుపోతూ ఉంటారని ఆ హోటలు నిర్వాహకులు వెల్లడించారు! ఇందులో సుమారు 500 పవన్లు తువ్వాలలు...

—జాన్ కోర్టు (ఫో.వ.ఫీ.)

# ప్రవాసాంధ్రులంటే...?

ఇటీవల ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురితమైన [29—5—70] 'మనం ఆంధ్రులం' అనే 'ప్రవాసి' గారి వ్యాసం ప్రవాసాంధ్రులలో తీవ్ర సంచలనాన్ని రేకెత్తించింది. అసలీ వ్యాసకర్తకు భరత ఖండ ప్రవాసాంధ్రులు గురించి [అది కూడా సరిగా తెలిసినట్టు లేదు!] తప్పిస్తే ఖండాంతర ప్రవాసాంధ్రుల గురించి విషయ పరిజ్ఞానం వున్నట్టు లేదు.

నేల నాలుగు చెరగుల నుండీ రాష్ట్రేతర ప్రదేశాలకే గాక— బర్మా, మలేషియా, దక్షిణాఫ్రికా, కెనడా ఆదిగా గల అనేకదేశాలకు జీవనోపాధికైతే నేమి, వ్యాపారార్థమైతే నేమి, తరతరాలుగా వలస వెళ్ళిన ఆంధ్రుల మనుగడ తెలిసి వుంటే—లేక తెలిసికొని వుంటే— వ్యాస సరళి మరో మలుపు తిరిగి ఉండేదేమో!

ఎందుచేతనంటే కేవలం ఏదో ఒక రాష్ట్రంలో గల ఆంధ్రుల్ని చూచి, ...ప్రవాసంలో వున్న ఆంధ్రులను పోల్చుకోవడం కష్టం! బెంగాలులో నున్న ఆంధ్రుడు బెంగాలీ తప్ప మరొక భాష మాట్లాడడు. అదే మాదిరిగా పై రాష్ట్రాలలో నున్న ఆంధ్రుడు అక్కడి వారి భాషనే కాకుండా ఆచార వ్యవహారాలన్నిటిలోనూ కలిసిపోయి వాళ్ళలో ఒకడుగా తయారవుతాడు." అంటూ వివరించిన వ్యాసకర్త—తన దృష్టిని నాలుగు వేపులా సారించకుండానే ప్రవాసాంధ్రులను [ఏకంగా] దుయ్యబట్టడం శోచనీయం!

ఏదేశమేగినా ఎందు కాలిడినా ఎన్ని విభిన్న సంస్కృతుల మధ్య జీవిక గడుపుతోన్నా మాతృభాషను— కట్టుబొట్టును తెలుగుదనాన్ని ప్రవాసాంధ్రులు ఏమాత్రం రూపు మాపలేదని ఘంటాపథంగా చెప్ప సాహసిస్తున్నాను."

సోదర "ప్రవాసి" గారు యీ విషయంలో బర్మా—మలేషియా తదితర దేశాంతర ఆంధ్రుల చరిత్రను పరికింప మనవి!

ఒక్క ఉదాహరణ— రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో బర్మా మీద జపాన్ దండయాత్ర చేసింది. ఆదేశంలో అప్పటికే స్థిరపడ్డ ప్రవాసాంధ్రులు యుద్ధ ప్రజ్వలన నుండి తప్పించుకోవడం కోసం మాతృదేశానికి తిరుగు ప్రయాణం కట్టారు. ప్రాణాలరచేతుల్లో వుంచుకొని తరలి వచ్చేస్తున్న ఒక ప్రవాస తెలుగు కుటుంబాన్ని జపాన్ సైనికదళం వలయాకారంగా చుట్టుముట్టేసి, కాల్పులు జరపబోయింది. 'మేమ్ బర్మీయులం కాము. గాంధీ మనుషులం తెలుగు వాళ్ళం" అంటూ గగ్గోలు పెడుతూ సైనికుల దగ్గర మొర పెట్టుకున్నారా ప్రవాస తెలుగు కుటుంబంవారు. వారి ఘోష సైనికులకు అర్థం కాక తికమక పడుతున్న సమయంలో వో సైనికునికి తెలుగు స్త్రీలు నుదుట ధరించిన కుంకుమ బొట్టు—పురుషులు ధరించిన కట్టు పంచె, లాల్చీలు [కాస్తో కూస్తో భాష] గుర్తుకొచ్చి "వారు తెలుగు వారే!" నని నిర్ధారించాడట!

ఫలితంగా ఆ తెలుగు కుటుంబం రక్షింపబడింది.

ఇది ప్రత్యక్ష నిదర్శనం!

అంటే... ఆవిపత్కర పరిస్థితుల్లో ఆ తెలుగు కుటుంబాన్ని రక్షించింది "ఆచార వ్యవహారము", "సంస్కృతి", "భాష" అని వేరే మనవి చేయ నక్కర లేదనుకుంటాను.

మరి, "ప్రవాసి" గారు రాసినట్టు ఆచార వ్యవహారాలకు స్వస్తి చెప్పి—"ప్రవాసులు" జాత్యేతరులలో కలిసిపోయి వుంటే— అట్టి జీవన్మరణ స్థితిలో ఆ కుటుంబ పరిస్థితి ఏవిధంగా పరిణమించి, ఉండేదో విజ్ఞులు ఊహించుదురు గాక!

ఒకచోట... 'ఆంధ్రేతరులతో కలసిమెలసి ఉండడం ముదావహం!' అంటూ 'కాని తన వ్యక్తిత్వాన్ని, తన ఆంధ్రత్వాన్ని, తనలోని గొప్ప గుణాల్ని... ఆంధ్రుడుగా నని తాను ఒకరికి తెలుపుకోవడంలో ఎందుకో ప్రతి ప్రవాసాంధ్రుడు సాధారణంగా సిగ్గు పడతాడు. ఉన్న మాటంటే ఉడుక్కోకండి. ప్రవాసంలో నున్న ఆంధ్రుల చరిత్ర చదవండి.. వాళ్ళ వ్యవహారాలు కళ్ళారా చూడండి అప్పుడు నిజం బయట పడుతుంది." అన్నారు.

అయ్యా! ప్రవాసిగారూ!

ప్రవాసాంధ్రుల చరిత్ర చదవమన్నారు, వ్యవహారాలు కళ్ళారా చూడమన్నారు.. నిజం బయట పడుతుందన్నారు..

బాగానే ఉంది!

అసలు తమ దృష్టిలో ప్రవాసాంధ్రులంటే ఎవరు? ఈ దేశంలోని రాష్ట్రేతరులేనా ప్రవాసాంధ్రులు? పోనీ అదే తమ ఉద్దేశ్యమైతే..[మిగతా రాష్ట్ర ప్రవాసాంధ్రుల సంగతి తర్వాత ఆలోచిద్దాం!] ఖర్గపూర్ ప్రవాసాంధ్రుల్ని తమ రెప్పుడైనా చూశారా? అక్కడి తెలుగువారి ఆచార వ్యవహారాలను సంస్కృతినీ విన్నారా? ఇటీవలనే కొన్నివేల రూపాయల ఖర్చుతో స్వంత భవనాని నిర్మించుకున్న విషయం తమ దాకా రాలేదా?

జీవిక కోసం అనేక రాష్ట్రాలకు, దేశాలకు—ప్రవాసం వెళ్ళినా, అక్కడ తెలుగు భాషా సంస్థలను పుస్తక భాండాగారాలను, సంఘాలను లెక్కకు మిక్కిలిగా నెలకొల్పుకొన్నా రన్నది తమకు తెల్సా? తెలిసుంటే యిలా రాసి వుండరు. గనుక మలేషియా—బర్మా ఆంధ్రుల చరిత్రని తెలుసుకోండి! తెలుగులో పక్ష, దిన, వార పత్రికల స్థాపించుకున్నారు సంస్కృతి ఉద్దీపనకు ఉడుతా భక్తిగా కృషి చేస్తూ వచ్చారు ఆచార వ్యవహారాలను విస్మరించకుండా, ఉగాది, సంక్రాంతి, దీపావళి పండగలను ఉత్సాహభరితంగా జరుపుకుంటూ జాత్యేతరులకు వాటి ఔన్నత్యాన్ని చాటి చెప్పారు ఆంధ్ర దేశ రాష్ట్రావతరణోత్సవాలను క్రమం తప్పక భారీ ఎత్తున జరుపుకుంటూ ప్రవాసంలో తెలుగు దినాన్ని నూటికి నూరు పాళ్ళు నిలబెట్టుకొచ్చారు.

ఇంతెందుకు! ప్రవాసంలో [బర్మాలో] నివసిస్తున్న ఏ ఒక్క తెలుగు కుటుంబం ఇంటి ద్వారబంధాలనయినా చూడండి.. "ఇది తెలుగువారి యిల్లు సుమా!" అని కొట్టొచ్చేలా గుర్తు తెచ్చే—పసుపు పచ్చని గుమ్మాలు, ఎర్రని కుంకుమ బొట్లతో తీర్చిదిద్ది కళకళలాడుతూ స్వాగత పలుకుతూంటాయ్!

ఇప్పు డేమంటారు?

ప్రవాసంలో వున్న ఆంధ్రుల చరిత్ర ముందుగా ఎవరు చదవాలి?

మరో చోట.. "భాషను మరచి.." అంటూ ప్రవాసుల మీద పెద్ద పెద్ద పదజాలాన్ని వాడారు. అదే నిజమైతే 1964 సంవత్సరంవరకు భారతదేశం ముక్కు, ముఖం తెలియని యీ వ్యాసకర్త (పుట్టి, పెరిగింది రంగూన్‌లో) యీ జవాబు యిచ్చే స్థితిలో వుండేవాడా! ఆలోచించండి!

"కించిత్తు నల్లి కుట్టిన మంచమునకు చేటు వచ్చు మహిలో సుమతీ!"—పద్యం చందాన ఏ కొందరి గురించో ఆలోచించి మొత్తం ప్రవాసాంధ్రుల్ని దుయ్యబట్టిన 'ప్రవాసి'గారు నిసలైన ప్రవాసాంధ్రుడై వుంటే తన సోదర ప్రవాసాంధ్రుల గురించి శోచనీయమైన యీ "వ్రాతలు" రాసి వుండేవారు కాదు.

"నా కలం పదునుగా ఉంటే....నా భాష కటువుగా ఉంటే.. నా మాటలు కష్టం కలుగజేస్తే అందుకు నిజం చెప్పడమే కారణం నిజం ఎప్పుడూ చేదుగానే ఉంటుంది. చేదు మింగగలుగుతే ఆరోగ్యం బావుంటుంది!"

ఈ పై వాక్యాలు 'ప్రవాసి' గారివి.

ఈ వ్యాసంతో పాటు వాటిని వారికే తిరిగి అప్పజెప్పవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను.

ప్రాజ్ఞులు విషయ పరిశీలన జేయ ప్రార్థిస్తున్నాడను.

—ఖీశెట్టి లక్ష్మణరావ్

క్రూక్స్

# లాక్టో-కేలమైన్

## ఏస్ట్రింజంట్ రూపములో?

**అవునండి!**

ఏస్ట్రింజంట్ రూపములో మచ్చలు, మరకలు
వల్ల మీ రూపమును పాడవకుండా
కాపాడుతుంది.
కేలమైన్ మరియు విచ్ హాజెల్
కలిసి మీ చర్మమును రక్షించి
మీ రూపమునకు పట్టు వలె
మెరుగులు దిద్దును.

క్రూక్స్
**లాక్టో-కేలమైన్**
సంపూర్ణ
సౌందర్య
సాధనము




ఇప్పుడు
మినీ సైజులో కూడా లభిస్తోంది.

క్రూక్స్ ఇంటర్‌ఫ్రాస్ లిమిటెడ్, బొంబాయి-25

lam.CIL.LC.



'జగత్ జెట్టీ'లో శోభన్ బాబు.

# సినిమా

## సెట్టులోనే సహజమైన గార్డెన్

ప్రసాద్‌లో నవశక్తి షూటింగు జరుగుతూ వుంది. సెట్టులోనే సహజమయిన గార్డెన్‌ను నిర్మాత గంగాధరరావు, సూరన్నచే నిర్మించారు. మీ అభిమాన హీరో ఎన్. టి. రామారావు. నేటి విజేనాయిక వాణిశ్రీ రెడీగా నిలబడ్డారు. దర్శకుడు సి. ఎస్ రావ్ 'స్టార్టు' అనడమే తరువాయి శ్రీ రామారావు వాణిశ్రీ చీరకొంగును పట్టుకుని నైసుగా, లేమగా లాగడం, వాణిశ్రీ వయ్యారంగా హీరో ఒడిలో వాలడం ఒక్క త్రుటిలో జరిగిపోయింది

చిత్రసమీక్ష:

# జగత్ జెట్టీలు

▣ నిర్మాతకి ఆత్మవిశ్వాసం ముఖ్యమే. తను నిర్మించే ప్రతిచిత్రం చాలా గొప్ప కళాఖండం అనుకోకపోతే ఏ నిర్మాతా తన చిత్రాన్ని పూర్తి చెయ్యలేడు నిర్మాత దృష్టిలో అది కళాఖండమే కావొచ్చు. కాని, చూడవలసినది చెప్పవలసినది ప్రేక్షకులు అనేమాట కూడా జ్ఞాపకం వుంచుకోవడం అవసరం. నిర్మాతకి ప్రేక్షకులు ఆత్మవిశ్వాసం కలిగించే చిత్రాల్లో జగత్‌జెట్టీలు ఒకటి!

పి. ఏకామ్రేశ్వరరావు, కే. రాఘవులు అమితోత్సాహంతో నిర్మించిన చిత్రం ఇది. ఎన్నుకున్న కథావస్తువు మంచిది. క్రయిమ్ చిత్రాలకు ప్రధానావసరాలైన నస్పెన్సు థ్రిల్లూ పుష్కలంగావున్న ఈ చిత్రం చిత్రీకరణ కూడా ఆంగ్ల చిత్రాలు చూడని వారికి సరికొత్తగానే కనిపిస్తుంది. కథ పూర్తిగా ఒక అద్భుతమైన అద్దం ముక్కమీద ఆధారపడి వుంటుంది. అద్దం ముక్కకి ఒక సినిమా కథావస్తువు కాగలిగినంత 'అద్భుతం' ఎలా వచ్చింది అనే సంశయం ఈ చిత్రంచూస్తే తీరిపోతుంది!

అప్పుడే అయిపోయిందా - అనిపించే కథాగమనము, పాత్రనిబట్టి నటీనటులూ, నటీనటులనుబట్టి పాత్రలూ రాణించిన జగత్‌జెట్టీలులో శోభన్‌బాబుఉత్సాహమైన నటన చూసి తీరవలసిందే. కక్షసాధించే యస్. వి. రంగారావు, అనవసరంగా అనుమానాల పాలయ్యే గుమ్మడి, చలాకీ అమ్మాయిగ వాణిశ్రీ, హాస్యంలో రాజబాబు శృంగారంలో విజయలలిత, విలన్‌గా ప్రభాకర రెడ్డి ఈ చిత్రానికి ప్రాణం పోశారు. చంద్రమోహన్, ఏకామ్రేశ్వరరావు, మాలతి, స్నేహప్రభ మొదలైనవారు కథని రసవంతం చేశారు.

నటీనటులందరూ పాత్రలని ఎంత సమర్థవంతంగ నిర్వహించారో — అంత జనరంజకంగానూ కథని రక్తికట్టించారు. దాసరి నారాయణరావు సంభాషణలు నందనరావు దర్శకత్వమూ కోదండపాణి సంగీత దర్శకత్వమూ చిత్రాన్ని మాడముచ్చట దిద్దితీర్చాయి. లక్ష్మీ ఫిలింస్‌వారు విడుదల చేసిన ఫల్గుణా ప్రొడక్షన్స్‌వారి జగత్‌జెట్టీలు చూసితీరవలసిన క్రయిమ్ చిత్రాల్లో ఒకటి!

—సీతరాజు. ●



'విప్లవ పర్దిల్లాల్ల'లో ...ందన.



'రాణీ రాణీ'లో కెనమిస్

కవి ఆరుద్రగారు వ్రాసిన ఈ పాటని అభినయించారు: —

'కళ్ళల్లో కళ్ళుపెట్టి చూడు
గుండెల్లో గుండెపెట్టి చూడు
సందెల్లో బందీవై చూడు
సయ్యాటలాడి చూడు'

నటి వాణిశ్రీకి శారద వాయిస్‌నిచ్చింది. కరెక్టుగా సరిపోయింది. శారద అంటే 'మనుషులు మారాలి' ఊర్వశి శారద అనుకునేరు. కాదు – కాదు. హిందీ నేపథ్య గాయిని శారద. శంకర్ – జైకిషన్ సారథ్యంలో వాణిశ్రీకిగాను శారద, రామారావుకుగాను ఘంటసాల పాడారు. కేరళ ప్రాంతాల్లో వర్షాలు అధికంగా వుండడం వల్ల, ఇన్‌డోర్‌లోనే సెట్టువేసి ఈ పాటను చిత్రీకరించారు. శ్రీ గంగాధరరావు నిర్మిస్తున్న యీ చిత్రంలో రామారావు, వాణిశ్రీలుగాక శారదకూడా ఒక ముఖ్య పాత్రను పోషిస్తూంది.

* * *

మాధవీ కంబైన్స్ వారి మొదటి షెడ్యూలు కొడైకెనాల్‌లో జరిగింది. నాగేశ్వరరావు, లక్ష్మిలకు సంబంధించిన ప్రేమపాట పిక్చరైజు చెయ్యబడింది. రెండవ షెడ్యూలు జూన్ 15 నుండి 23 వరకు సారథి స్టుడియోలో (ఇన్‌డోర్) జరుగుతూ వుంది. ఈ షెడ్యూలులో జగ్గయ్య, అంజలీదేవి రాజనాల, పెరుమాళ్ళు, ధూళిపాళ పాల్గొంటారు. శ్రీ సుబ్బారావు, ప్రసాద్‌లు నిర్మిస్తున్న యీ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు. గుహనాథన్ వ్రాసిన కథకు, బొల్లిముంత మాటలను సమకూర్చారు. సంగీతాన్ని కె. వి. మహదేవన్, ఛాయను సెల్వరాజ్ నిర్వహిస్తున్న యీ చిత్రం లక్ష్మీ పిక్చర్స్‌ద్వారా విడుదలవుతుంది.

## ఒకే కుటుంబం

క్యారెక్టర్ యాక్టర్ నాగభూషణం సమర్పిస్తున్న 'ఒకే కుటుంబం' చిత్రం యొక్క షూటింగు జూన్ 10న న్యూటోన్ స్టుడియోలో ప్రారంభమైంది. ఎ. భీంసింగ్ దర్శకత్వం వహించడం ఒక విశేషం. ఈ చిత్రానికి పాలగుమ్మి పద్మరాజు రచనా విభాగాన్ని, కోదండపాణి సంగీత సారథ్యాన్ని నిర్వహిస్తున్నారు. చిత్రంలోని ముఖ్యపాత్రలను ఎన్. టి. రామారావు, టి. ఎల్. కాంతారావు, నాగభూషణం, అల్లు రామలింగయ్య, ధూళిపాళ, లక్ష్మి, రాజశ్రీ, రుక్మిణి ధరిస్తున్నారు.

## కృష్ణంరాజుకు ప్రమాదం

'బంగారుతల్లి' షూటింగులో కృష్ణంరాజు, రమాప్రభలకు యాక్సిడెంట్ జరిగింది. గుర్రంమీదనుండి కృష్ణంరాజు క్రిందపడ్డారు. కుడిచేతి ఎముకలు రెండు విరిగినట్లు, ప్రమాదకరమయిన పరిస్థితి కాదని డాక్టర్లు చెప్పారు. క్రిందపడ్డ కృష్ణంరాజుమీద రమాప్రభ పడింది. ఆమెకు నడుం బెణికింది. ప్రస్తుతం యిద్దరూ కోలుకుంటున్నారు. ఏ శుభ ముహూర్తాన యీ చిత్ర నిర్మాణం ప్రారంభమయిందోగాని, యేదో ఒక అడ్డంకు, యిబ్బంది దైవికంగానే వస్తూనేవుంది.

* * *

రామవిజేతావారి 'తల్లీ దండ్రులు' షూటింగు దాదాపు పూర్తయింది. చక్కటి ఫ్యామిలీ సెంటిమెంటుగల యీ చిత్రానికి బాబూరావు దర్శకుడు. పినిసెట్టి మాటలను వ్రాసిన యీ చిత్రంలోని ప్రధాన పాత్రలను జగ్గయ్య, హరనాథ్, శోభన్‌బాబు, రేలంగి, చంద్రమోహన్, అల్లు రామలింగయ్య, లకరం, సావిత్రి, చంద్రకళ, విజయలలిత, నూతన నటి విజయ పోషిస్తున్నారు. ప్రభాకర్ నిర్మిస్తున్న రెండవ చిత్రం యిది. జూన్ ఆఖరి వారంలో జోతి పిక్చర్స్‌ద్వారా ఈ చిత్రం విడుదల కాగలదని తెలుస్తూంది.

## సినిమా డైరీ

● లక్ష్మీకళాచిత్రకు వారి ఆఫీసులో జూన్ 14న పూజ జరిగింది. శ్రీ రామారావు కొబ్బరికాయకొట్టారు. ఓ. ఏ. సుబ్బారావు దర్శకులు. నాయిక వాణిశ్రీ, హీరో రామారావు. షూటింగు సెప్టెంబరులో ప్రారంభం

● జూన్ 14న రాజ్యం పిక్చర్స్‌వారి పాటల రికార్డింగు ప్రారంభమైంది. ఈ చిత్రానికి ఘంటసాల సంగీతసారథి, కాంచన, నాగేశ్వరరావులు నాయికానాయకులు. హైదరాబాదు సారథిలో షూటింగు.

● జగపతి ఆర్ట్సు పిక్చర్స్‌వారి "దసరా బుల్లోడు" షూటింగు సారథి స్టుడియోలో జరుగుతూ వుంది. నాగేశ్వరరావు, వాణిశ్రీ, రంగారావు, గుమ్మడి, నాగభూషణం, పద్మనాభం, చంద్రకళ పాల్గొనే సన్నివేశాలను శ్రీవి. బి. రాజేంద్రప్రసాద్ చిత్రీకరిస్తున్నారు.

● హీరో నాగేశ్వరరావుగారు మద్రాసులో వీనస్, ప్రొడ్యూసర్స్ కంబైన్స్ షూటింగుల్లో జూన్ 1 నుండి 24 వరకు పాల్గొన్నారు.

● హీరో రామారావుగారు ఎన్‌ఏటి ఆర్ ఎస్టేట్స్ చిత్రం, శ్రీకాంత్, నవశక్తి, రాజేంద్ర ఆర్ట్స్ చిత్రాల్లోను, "శ్రీ కృష్ణ విజయంలోను" జూన్ 1 నుండి —29 వరకు పాల్గొంటున్నారు.

# సినిమా

ఈమధ్య తారలనైఖరి శ్రుతిమించి రాగనపడుతుంది. నిర్మాతలను కేవలం ఆటబొమ్మల్లాగా ట్రీట్‌చేసే తారలు కొందరు తయారయ్యారు. ఒక నిర్మాతకు పాత్ర నచ్చిందనిచెప్పి, అడ్వాన్స్ తీసుకుని, దుస్తులు కుట్టించుకుని, అన్నీ ఓ. కే. అయిన తర్వాత, తనకు ఆ పాత్ర నచ్చలేదనే కుంటిసాకుచెప్పి, నిర్మాతను ఆందోళన పరచింది ఒక తార.

మరొక ఆవిడ ఒకరికి కాల్‌షీటిచ్చి, అదే తేదీలో మరొకరికి వర్క్ చెయ్యడం ఆశ్చర్యాన్ని కల్గించింది. నిర్మాత దగ్గర అన్ని వసతులు, తనకు కావలిసిన రెమ్యునరేషన్ను ముందుగానే తీసుకుని, కాల్‌షీటు వచ్చినప్పుడు మాటతప్పే వాళ్ళు కూడా కనిపిస్తున్నారు. 'చెట్టు బాగా వుంటేనే అది చిగురించి, ఫలించి, ప్రతిఫలాన్ని యిస్తుంది. అదే విధంగా నిర్మాత నిలబడితేనే తారలు నాలుగు కాలాలపాటు చల్లగా వుండగలరనెడి నగ్నసత్యాన్ని తెలుసుకోవాలి.

## ముద్దుపై ముచ్చట్లు

మన చలన చిత్రాల్లో 'ముద్దు' ప్రవేశపెట్టడం తప్పా, ఒప్పా? అనెడి సమస్యను పరిష్కరించడానికై మద్రాసులో ఒక 'ఆలోచన సంఘం' యేర్పడింది. ఈ కమిటీలో ఎనిమిది మంది వున్నారు.

మద్రాసులో వెలసివున్న 'శాస్త్రి భవన్'లో జూన్ 10, 11 తేదీల్లో యీ నిర్మాతలు సమావేశమై చర్చ జరిపారు. చిత్రాల్లో 'ముద్దు' దృశ్యాలను అనుమతించవచ్చు అని కోస్లా కమిటీ కేంద్రప్రభుత్వానికి సిఫారస్ చేసిన విషయం మనందరికీ తెలిసినదే. సినిమాల్లో అసభ్యాన్ని, అశ్లీలాన్ని అరికట్టడానికై యీ ఆలోచన సంఘం తీవ్ర ప్రయత్నాలను చెయ్యడానికి పూనుకుంది. ఈ సభ్యులందరూ ప్రముఖ నిర్మాతలే. ఈ సమావేశానికి శ్రీ ఎం. వి. దేశాయ్ అధ్యక్షత వహించారు.

## స్టుడియోలో నందనవనం

ప్రసాద్ స్టూడియోలో ప్రకృతి రామణీయకతను ప్రస్ఫుటపరిచే నందనవనం వెలసింది. జలపాతాలు, సెలయేళ్ళు తరలి వస్తున్నా అనిపించే విధంగా ఆర్టు డైరెక్టరు గోఖలే కండ్లు మిరుమిట్లు గొలిపే సెట్టును నిర్మించారు. ఎత్తయిన రెండు పర్వతాలు, పర్వతానికి ఒకవైపు



'తల్లీ దండ్రులు'లో నూతన నటి విజయ, శోభన్‌బాబు

## మీకు తెలుసా?

మాస్కోలో నిర్మితమయ్యే చిత్రాలను బొంబాయిలో ప్రదర్శించడానికై బొంబేలో ఒక ఏర్‌కండిషన్‌డ్ థియేటరును నిర్మించడానికి రష్యా ప్రభుత్వం నిశ్చయించినట్టు తెలుస్తూంది.

హాలివుడ్ నటుల్లో ప్రముఖుడిగా విలసిల్లే ఆంథోనీక్విన్ నూరు చిత్రల్లో నటించడం పూర్తయినా, యింతవరకు ఆయనకు 'ఆస్కార్' అవార్డు రాలేదట.

నటి మాలాసిన్హా ఒకప్పుడు కలకత్తా ఆకాశవాణి కేంద్రంలో గాయకిగా పాటలు పాడుతూ వుండేదట.

హాలివుడ్ నటుడు పీటర్—వోటుల్ ఒక చిత్రంలో నటించడం పూర్తి కాగానే, నర్సింగ్‌హోంలో రెండు మాసాలు విశ్రాంతి తీసుకోవడం అలవాటుగా పెట్టుకున్నారట.

రతిమన్మథుల శృంగార కేళీ విలాసాన్ని ప్రతిబింబింపచేసే శిల్ప కళా వైభవం, మరొకవైపు ఆశ్చర్య చకితుల్ని చేసే కళా మండపాలు — అబ్బ — యేమని వర్ణించగలను? పండు వెన్నెల, నెమళ్ళ క్రీడా విలాసం, సుగంధ పరిమళ సోయగాన్ని యిచ్చే మలయమారుతం ప్రసాద్ స్టుడియోను పావనం చేసిందనే చెప్పాలి. ఈ సుందర ప్రదేశాన్ని శ్రీ ఎస్వీరంగారావు కుసుమకోమలి జయలలిత సరసన వుండి ఆనంద పారవశ్యం చెందాలని నిశ్చయించాడు. అందాల బంతి జయలలిత అజానుబాహుడయిన రంగారావును చిలిపి చేష్టలతో, వలపు చూపులతో మత్తెక్కించిన విధానాన్ని మీకు తెలపాలిగా, ఆవిడ ఏం చేసిందో తెలుసా? ఒక గమ్మత్తయిన పాట పాడింది.

ఆడించే జాణనేగాని

ఆడుదానను కానే కాను—యిదీ పాట.

'ఓకే' అన్నారు దర్శకులు కామేశ్వరరావు.

ఈ రసవత్తర ఘట్టం కౌముదీ ఆర్ట్సు పిక్చర్స్ వారి 'శ్రీకృష్ణ విజయము'లో కనిపిస్తుంది.

*   *   *

పై పౌరాణిక చిత్రంలో శ్రీకృష్ణుడిగా ఎన్. టి. రామారావు సత్యభామగా జమున, రుక్మిణిగా దేవిక, నారదునిగా కాంతారావు నటిస్తున్నారు. 'మల్లెమాల' వ్రాసిన కథకు, పింగళి మాటలను సమకూర్చారు ఎస్వీరంగారావు ద్విపాత్రాభినయం చేస్తే యీ చిత్రంలో జయలలిత కథానాయిక. తెలుగు చిత్రలోకంలో ఒక మహాయజ్ఞాన్ని తలపెట్టిన నిర్మాత ఎం. ఎస్. రెడ్డి శ్రమ వృధా పోదు, ఈ చిత్రం విజయ పిక్చర్స్ ద్వారా మిమ్మల్ని ఆనందపరచడానికి సర్వాంగ సుందరంగా ముస్తాబవుతూ వుంది.



"శ్రీదేవి"లో ఆర్. విజయ

## స్టుడియోలో బర్త్‌డే

శారదా స్టుడియోలో అది ఒకపెద్ద భవనం. ఒక టేబిలు, ఒక కుర్చీ హాలు మధ్యలో వుంది. టేబిలుపైన బేబీ బ్రహ్మజీ (మూగనోము ఫేం) ముద్దుగా కూర్చుని వున్నాడు. ముద్దులొలికే పాపాయిని కె. ఆర్. విజయ ముద్దుల్తో ముంచెత్తారు. ఏమిటీ హడావిడి అని బి. ఎస్. నారాయణగార్ని అడిగాను. ఇవాళ బ్రహ్మజీ పుట్టినరోజు అన్నారు. అలాగా అని ఒకవారగా నిల్చున్నాను.

## సినిమా

ఒక్క నిమిషంలో రోజారమణి వయ్యారంగా వచ్చి, బ్రహ్మజీకి ఒక ముద్దిచ్చి, పుట్టినరోజు పండుగకు తన కమ్మని పాటను జత పర్చింది.

జననీ నయనాల
వెలిగించే రోజా నేడు
అలలై మమతలూరి
నా మనసే పాట పాడ.—

'కట్' అన్నారు దర్శకుడు బి. ఎస్. నారాయణ. ఈ సన్నివేశం ... దులోదని చెప్పాలిగా, మహా... పిక్చర్స్ నిర్మిస్తున్న 'శ్రీదేవి' చిత్రంలోనిదే.

శ్రీ ఆర్ ఎస్ నారాయణ నిర్మిస్తున్న 'శ్రీదేవి' చిత్రంలో టైటిల్ పాత్రను రోజారమణి పోషిస్తూంది. పై పాటను శ్రీ శ్రీ వ్రాసారు. వెంకటేష్ అధ్వర్యంలో సుశీల పాడింది. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను హరనాథ్, విజయ, గుమ్మడి, సూర్యకాంతం, రాజబాబు, సంధ్యారాణి, అల్లు రామలింగయ్య, రాధాకుమారి, సాక్షి రంగారావు, రుక్మిణిగార్లు ధరిస్తున్నారు. ఈ చిత్రం ఆంధ్రాలో కుమారస్వామి పిక్చర్స్, నైజాంలో పద్మ పిక్చర్స్, సీడెడ్‌లో అనురాధా పిక్చర్స్ ద్వారా విడుదలవుతుంది.



"విజయం మనదే"లో శాంతకుమారి, దేవిక

## చిలిపి జంట కలిపి పాట

విజయా గార్డెన్స్‌లో మరొక హుషారయిన షూటింగు తగిలింది. టిప్‌టాప్‌గా డ్రస్ చేసుకున్న రాజబాబు, అప్‌టుడేట్‌గా అలంకరించుకున్న కాంచన జూనియర్‌ను తన ఆటపాటలతో మెప్పించి, ఆమెలో హుషారును జొప్పించాడు. ఎలాగో తెలుసా? ఇలా...

రాజబాబు:



'అగ్నిపరీక్ష'లో పద్మనాభం, కృష్ణ.

"ప్రేమించావే నిన్ను ప్రేమింతునే ప్రేమలోని లబ్బు నీకు చూపిస్తానే రుచి చూపిస్తానే ... అంటూ ఆమెను అమాంతంగా కౌగలించుకో బోతాడు. ఆమె మాత్రం తక్కువ తినిందా? కాస్త తగ్గమాన్. తగ్గ అనింది:

జూనియర్ కాంతం :
ప్రేమంటే అంగట్లో సరుకు కాదయ్యా డబ్బుపెట్టి కొందామంటే దొరకబోదయ్యా అంటూ అతనికి ఘాటయిన జవాబిచ్చింది. 'కట్' అన్నారు దర్శకుడు అయ్యన్నమూర్తి. ఈ చిలిపి వలపుల సన్నివేశం 'ఆడజన్మ'లో కనిపిస్తుంది. శ్రీ జి. వి. ఎస్. రాజు నిర్మిస్తున్న యీ చిత్రంలో కథానాయిక దేవకిగా జమున అనితర సాధ్యమయిన నటనా వైభవాన్ని అగుపర్చింది. నవయుగా పిక్చర్స్ విడుదల చేసే యీ చిత్రం లోని ప్రధానపాత్రలను హరనాథ్, గీతాంజలి, నాగభూషణం, చంద్రమోహన్, రాజబాబు, మాలతి, కాశీనాథ్ తాతాగార్లు పోషించారు. ఇంతవరకు దుష్టపాత్ర పోషణలో దిట్ట అనిపించుకుంటున్న సత్యనారాయణ ఒక వెరైటీ పాత్రను 'ఆడజన్మ'లో చక్కగా పోషించారు.

## కలర్ లో బీదలపాట్లు

'బీదలపాట్లు' చిత్ర నిర్మాణాన్ని ఎప్పుడు ప్రారంభిస్తారు? అని ప్రముఖ దర్శక నిర్మాత విఠలాచార్యగారిని ప్రశ్నించాము. బహుశా యీ సంవత్సరంలో వుండదు. ప్రస్తుతం రాజేంద్ర అర్జున, కె.జి.ఆర్. షూటింగులు జరుగుతున్నాయి. ఆగను లో ఒక జానపదాన్ని తెలుగు, తమిళ భాషల్లో నిర్మించాలనుకుంటున్నా. 'బీదలపాట్లు' చిత్రాన్ని గ్రాండ్ స్కేలులో కలర్‌లో నిర్మించాలనే తలంపు వుంది అన్నారు.

* * *

నవభారత్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'రౌడీరాణి' చిత్రంలో వీరవనితగా విజయలలిత వీరవిహారం చేస్తోంది. ఈ చిత్రంలో బందిపోటు దొంగలుగా సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, నెల్లూరు కాంతారావులు నటిస్తున్నారు. దర్శకుడు కె.ఎస్. ఆర్. దాస్. డూప్ అవసరం లేకుండానే విజయలలిత ఫైట్స్ చేసింది. మొదటి షెడ్యూలు పదిరోజులు జరిగింది. సగం పిక్చరు తయారైంది. ఈ చిత్రానికి విశ్వప్రసాద్ మాటలను, సత్యం సంగీతాన్ని సమకూరుస్తున్నారు శ్రీ ఏ. పూర్ణచంద్రరావు సమర్పించే యీ చిత్రంలోని సహాయభూమికలను రాజబాబు, జ్యోతిలక్ష్మి, ధూళిపాళ (గెస్టు) రావికొండలరావు (అతిథి)లు ధరిస్తున్నారు. కెమెరా కన్నప్ప.

—శ్రీనివాస్ ●



'శాంతి' హిందీకలర్ చిత్రం కథానాయికతో దర్శకనిర్మాత సత్యానంద్.

# పుస్తకాలు

## కుమారి అనురాధా గోవిందాచారి

### భరత నాట్య ప్రదర్శనం

మద్రాసు వాణిమహల్‌లో కుమారి అనూరాధా గోవిందాచారి భరత నాట్య ప్రదర్శన ప్రేక్షకులకు కన్నులపండుగ చేసింది. పదవిన్యాసంలోనూ హావభావ ప్రకటనలోనూ ప్రత్యేకతను సంతరించుకున్న కుమారి అనురాధా గోవిందాచారి—పుష్పాంజలి, స్వరజతి, మాండూక శబ్దం, వర్ణం, తిల్లానా మొదలైన అంశాలని అతి నేర్పుగా అభినయించి ప్రేక్షకులను రంజింప జేసింది. ఉజ్వల భవిష్యత్తుగల కుమారి అనూరాధ నాట్యకళాకేసరి వళువూర్ రామయ్యపిళ్లైగారివద్ద మొదట నృత్యాభ్యాసం చేసింది. తర్వాత కే. రాజరత్నంగారి శిష్యురాల ననిపించుకున్నది. 1962 లో మొట్టమొదటి అరంగేట్ర ప్రదర్శన ఇచ్చింది. మద్రాసులోను, బొంబాయిలోను గత ఏడేళ్లుగా ఈమె పెక్కు నాట్యప్రదర్శనలు ఇవ్వడమేకాకుండా అనేక అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొని మంచి నర్తకిగా పేరు తెచ్చుకున్నది. నర్తకిగా ప్రకాశించడానికి తగిన నిండయిన పర్సనాలిటీ, అందచందాలు గల కుమారి అనురాధా గోవిందాచారి—మనకున్న కొద్దిపాటి యువ నర్తకీమణుల్లో ఒకరు.

### భరతనాట్య అరంగేట్రం

గొల్లపూడి శ్రీరాములుగారి కుమారుడు చి. జిష్ణుమోహన్, కుమార్తె చి. సౌ. మాయాదేవిల భరత నాట్య అరంగేట్రం మద్రాస్ వాణి మహల్‌లో జరిగింది. పిన్న వయస్కులైన వీరిద్దరి నృత్యమూ సభికులను ఎంతగానో అలరించింది. అరంగేట్రమని పించకుండా ఎంతో అనుభవం వున్నట్టుగా నృత్యం చేసిన ఈ చిరంజీవులిద్దరూ సేవా స్టేజికి చెందిన శ్రీమతి కల్పగం శిష్యులు. ప్రొఫెసర్ పి. సాంబమూర్తి, నటి లక్ష్మి మొదలైనవారు చిరంజీవులను ఆశీర్వదించిన వారిలో ఉన్నారు. —సి. కె. రాజు

### వివాహం

ఆంధ్రపత్రిక ఏజెంటు [రొంపిచెర్ల] శ్రీ సి. ఆర్. విశ్వనాధచెట్టి కుమారుడు చి. సి. సుబ్రహ్మణ్యానికి శ్రీ పురం నారాయణస్వామి చెట్టి కుమార్తె చి. సౌ. సుజాతకుమారికి రాయచోటిలో వైభవంగా వివాహం జరిగింది.

## మధువని (కథాసంకలనం)

ఎనిమిది కథలు. 131 పేజీలు. రూ 3. ప్రతులకు: పెద్దోజు రాజేశ్వరరావు, 10-లైను, 2 వ అడ్డరోడ్డు, అరండేల్‌పేట, గుంటూరు—2.

ఈ సంపుటిలో ఇద్దరు రచయిత్రులు, ఆర్గురు రచయితల అభ్యుదయ సాహిత్య రచనలున్నాయి. ఇంచుమించు కథలన్నిటిలో బాధ, విషాదం కనిపిస్తుంది. 'ఇందుమతి' కథలో ఇందుమతి భానూని కలుసుకున్నటు గానే రెండవ కథలో భాస్కరం కన్న తల్లిని కనుక్కోగలుగుతాడు.

'మధుర స్మృతి' కవితాధోరణిలో నడిచిన రచన. 'శాపగ్రస్తుడు' కథ ఈ సంపుటికి తలమానికం. 'పరీక్ష పోతే మరోసారి కట్టవచ్చు. కాని మూడ్‌పోతే చిత్రం కుదరదు.' అని చిత్రకారుడు రవి చెప్పిన మాటలు సమంజసమే.

రచయితల, రచయిత్రుల ప్రయత్నం ప్రశంసనీయంగా వుంది.

## విందు భోజనం:

రచన, చిత్రణ: శ్రీ కలువకొలను సదానంద. 83 పేజీలు. రూ 2. ప్రతులకు: విశ్వ పథ ప్రచురణలు, నేండ్రగుంట, [చిత్తూరు జిల్లా.]

ముఖ్యంగా పిల్లల పుస్తకాల విషయంలో వయసు మనస్సులో పెట్టుకుని రచన చెయ్యాలి. ఈ పుస్తకం ఇన్నేళ వయసు పిల్లలకు అని కేటాయించాలి. ఈ పుస్తకం చూస్తే మనకింకా ఆ పద తి పట్టుబడలేదేం? అనిపిస్తుంది.

'విందుభోజనం' పిల్లల పుస్తకమని ఎక్కడా సూచన లేకపోయినా రచన తీరూ, ఉపయోగించిన కైపునుబట్టీ అలా అనుకోవాలి. ఈ వూహే నిజమయితే, రచన సంస్కారం కోరుతూందని చెప్పక తప్పదు. ఇందులో కథలు పదమూడు. వీటిద్వారా నీతులు బోధించటం ముఖ్యోద్దేశం. పగానికి పైగా చిన్నచిన్న ఐడియాలే కథారూపం పొందాయి. 'విందు భోజనం', 'విడిచివచ్చిన నవ్వు' హాస్యకథలు. 'రాచబిడ్డ' అస్పృశ్యతకు మంచి తార్కాణ కథ. భీతహరిణాలు, పిపాసోపశమనార్థం, ప్రజా భిక్ష్యాన్ని— లాంటి శనగల్లో రాళ్లు అడ్డురాకపోతే పెద్దవయసు పిల్లలు హాయిగా చదువుకోవచ్చు.

## తిరుగబడు

1/8 డెమ్మి 78 పేజీలు. రు 2— ప్రతులకు: నెల్లుట్ల సంజీవరావు, స్వేచ్ఛా సాహితి, 6 551/3 బ్రాహ్మణ వీధి, హన్మకొండ, వరంగల్—1.

పదిమంది ప్రముఖుల కలాలనుండి వెలువడిన స్వచ్ఛంద కవితా సంచలనం. 'తిరుగబడు' అనేది ఈ సంకలనానికి నినాదం. కవితా పరిణామం అనే అవతారా లెత్తుతున్న ఈనాడు ఇది ఏ వర్గానికి చెందిందీ అనే ప్రశ్న అనవసరం.

పోరాటం లేకుండా నిజమైన శాంతి రాదు. త్యాగాలు లేకుండా ఫలితాలు రావు. స్వాతంత్ర్యం ఆకాశంనుంచి వూడి పడదు. కనుక అహింస, సత్యాగ్రహం అనే తుప్పు పట్టిన ధర్మాలను అవతలికి నెట్టాలి. అజ్ఞానం భయంతో కూడిన మతాన్ని చికిత్స చెయ్యాలి.

కొన్ని జేబుల్లోకే ప్రవహించే ధనాన్ని అందరికీ అందించాలి. అడ్డు వచ్చే అధములెవరైనా అంతమొందించు పీడితులూ పీడించే వాళ్ళకీ మధ్యని రాజీ అసంభవం అందుకే విప్లవించు, తిరుగబడు, కాగడావై దుముకు ఆయుధం పట్టు—ఇలాటి ప్రబోధాలతో యువక రక్తాన్ని ఉద్రేకపరచి, ప్రజా పోరాటానికి సాయపడి, సామ్యవాద సమాజాన్ని నిర్మించటం ఈ అభ్యుదయవాదుల ఆదర్శం.

## కలుకు మెరుపులు

'తిరుగబడు' గానం విప్లవ వాదులదయితే—మానవుడితో ప్రకృతి సవాల్ చేస్తూ, విధిని నిర్ణయించే చక్కటి కథనం 'కలుకు మెరుపులు' ఆంగ్ల రచన: నిర్మల్ జాకొబ్, తెలుగు: శ్రీ జయసూర్య.

దేశం, వాతావరణం, మనుష్యులూ, మతాలు, ఆచారాలు నూటికి నూరు పాళ్లూ కేరళ దేశానివి... అక్కడిదే 'వున్నవేలి' గ్రామం రంగస్థలం. బడిపంతులు నాన్సార్‌నాయకుడు. బండివాడికూతురు రాహేల్ నాయిక.

ఈ నవలలో మరొక ముఖ్య పాత్ర—అన్నమ్మ. ఇది తెలుగు పేరులా ఉండటమే కాదు. ఆమె వేదాంత ధోరణి కూడా తెలుగువారందరి నచ్చుతుంది. 'చనిపోయిన వాళ్ళు నిద్రపోయినట్లే. కొందరు కొంచెం ముందుగా—కొన్ని రోజులు, నెలలు, లేదా సంవత్సరాల ముందుగా నిద్రపోతారు. త్వరలోనే మనం కూడా.......'అంటుంది అన్నమ్మ.

నెలలకు మలయాళం పేర్లే వాడారు. వాటికి సరిపోయే తెలుగు నెల పేరు తెలిస్తే కద, రచన మన కింకా సన్నిహితం కావడం?

కేరళ శాస్త్రీ, ప్రజల్ని మనకి పరిచయం చేసే ఈ 180 పేజీల నవల ఐదు రూపాయిలు. ప్రతులకు: శ్రీ ఎర్రమిల్లి నరసింహారావు, రవీంద్రా పబ్లిషింగ్ హవుస్, నేతాజీ ప్రెస్, తణుకు 'పశ్చిమ గోదావరి.]

—శివకుమారి

## వంధ్యత్వం

పిల్లలులేనివారికి ప్రత్యేకంగా శ్రీ రాంషా, శిరీష రచించిన ఈ పుస్తకంలో వంధ్యత్వం గురించి నివారణోపయాలగురించి సోదాహరణంగావివరించడం జరిగింది. 140 పేజీల పుస్తకం వెల: రెండు రూపాయలు. అభిసారిక ప్రచురణలు, శామల్‌కోట.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press: 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

